# కళ్ళద్దాలు

ఏకాంకిక

# పిలువని పరదేశి

ఏకాంకిక

(గాంధీజీ సౌత్ ఆఫ్రికా జీవితంలో ఒక ఘట్టం)

రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు

బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

## గమనిక

ఈ నాటికలను ప్రదర్శించ గోరేవారు ముందుగా నా అనుమతి పొందవలసి ఉన్నది. అనుమతి కొరకై ప్రదర్శన తేదీ, సంఘంపేరు. కార్యదర్శి పేరు, ఏ సందర్భంలో ప్రదర్శించ దల్చుకున్నదీ పూర్తి వివరాలతో జవాబు కొరకు తపాలాబిళ్ళలతో సహా పంపాలి. అట్లా పంపకపోతే అనుమతి పంపబడదు.

గంగాధరరావు

## పాత్రలు

| | |
|---|---|
| రఘు :— | ఒక ఆఫీసులో ఉద్యోగస్థుడు |
| మామయ్య :— | రఘు మేనమామ |
| వెంకట్రామయ్య :— | రఘుపై ఉద్యోగి |
| కృపానిధి<br>కృష్ణారావు } :— | రఘు క్రింద ఉద్యోగులు |
| పాపారావు :— | రఘు పక్కింటాయన |
| శ్యామలరావు :— | C. I. D. Dept వాడు |
| కౌసల్య :— | రఘు భార్య |

# ము ం దు మా ట లు

కళ్లద్దాలు, హాస్యనాటికే గాని కేవలం ప్రయోజనం లేనిది మాత్రంకాదు. నాటకాల్లో ఒక ప్రయోజనం తప్పకుండా వుండాలనే పట్టుదల నాకులేదు. నా నాటక రచన ప్రదర్శనానికే. ప్రదర్శనాయోగ్యంగావుంటే ప్రయోజనం తీరినట్లే. నిజానికి ప్రతినాటకం ఏదో ప్రయోజనాన్ని సాధించాల్సి వుంవనటం తప్పు. ఏ సమస్యగల నాటకమయినా అందరికీ ఎప్పుడూ ప్రయోజనకరంగా వుండదు. నూటికి తొంభై మంది నాటకాలు చూసే ప్రేక్షకులు ప్రదర్శనకోసమే చూస్తారు. తక్కిన పదిమందీ కూడా నాటకంలో ఒక ప్రయోజనం వుందని సంతోషించేవాళ్ళే గాని అది వారికి ప్రయోజనకరంగా వుండికాదు. నాటకాలవల్ల సమస్యలు తీరతాయని గాక, సమస్యలు తీర్చటానికి నాటకంకూడా వక ఉదాహరణం అనిగాని, నేను భావించను. అందువల్ల నా నాటకాలల్లో సమస్యలు తీసుకోను. అయితే నాటకంలో మన నిత్య జీవితం రాక తప్పదు. గనక జీవితమంతా పెద్ద పెద్ద సమస్యలతోనే, కాక చిన్న చిన్న సమస్యలుకూడా వుంటాయిగనక, అవ్వే నా కథలన్నింటికీ అధారమవుతున్నాయి. ఆ దృష్టితో చూస్తే—నా హాస్యనాటిక లన్నింటిలోనూ ప్రయోజనంవుంది. అల్లాగే "కళ్లద్దాల" లోనూ వుంది.

మనం ఏ దృష్టితో ప్రపంచాన్ని చూస్తాంతే అల్లా ప్రపంచం కనబడుతుంది. ఎవరి కళ్లద్దాలు వారికి. ప్రపంచాన్ని మంచిగానే ఎప్పుడూ అర్థంచేసుకోవాలా. చెడుగానే అర్థంచేసుకోవాలా అనేది తేల్చి చెప్పగలిగే విషయం కాదు. ప్రపంచంలో ఎప్పుడూ మంచి ఎంతవుందో, చెడూ అంతేవుంది. మనం చెడునే కథావస్తువు చేసుకోవాలా మంచితనాన్నే విస్మరించాలా అన్నది రచయిత ఎప్పుడూ తేల్చుకోలేని సమస్య. ఈ నాటికలో ఆ ప్రయత్నమే జరిగింది.

# కళ్ళద్దాలు

[తెర లేచే సరికి భార్యా భర్తలు కూర్చుని వున్నారు]

రఘు—పద్దు రాయటం యింకా పూర్తవలే?

కౌస—ఇదిగో, అయిపోయింది. ఆ, చాకలి దానికి అయిదు రూపాయిలు, పాలు, పెరుగు, పన్నెండు రూపాయిలు వెచ్చాలకొట్లో యిరవై ఎనిమిది రూపాయిలు, సామాను అయిదు రూపాయిలు...ఆ, వ్రాశాను.

రఘు—వ్రాశావు సరే! మిగిలిం దెంత!

కౌస—ఉండండి: కూడి చెప్తా. (కూడి) 120-6-6.

రఘు—120 రూపాయిలు మిగిలిందా! ఎట్లా మిగిలింది?

కౌస—ఓహో! మిగిలింది అడిగారా? ఆగండి—తీసేసి చెప్తా.

రఘు—బాగానే వుంది.

కౌస—ఆఁ! 5-9-6.

రఘు—ఆ! దీంట్లో ముందు రాబోయే సంగతి ఖర్చు రెండు రూపాయిలు. జేబు ఖర్చుకు పది రూపాయిలు నీ పువ్వుల ఖర్చు రూపాయిన్నర.

కౌస—రూపాయిన్నరేనా! పువ్వులకి?

రఘు—అంతే! అంతకంటే వీల్లేదు యీనెల.

కౌస—మీకు జేబు ఖర్చుకి పదిరూపాయిలు కావాలి? నాకు పువ్వులకి రూపాయిన్నర చాలా?

రఘు—అంతకంటె ఎక్కువెందుకు? అనవసరంగా పాడై పోయిన తర్వాత అవతల పారేశే దానికి. ఈ నెల అయిదు మంచి సినిమా లొస్తున్నాయే - చూడాల్సినది. అయిదింటికి ఇద్దరికీ 2-8-0 చొప్పున 12-8-0 కావాలి. చెపితే వినవేం?

కౌస— అహా! సరేలెం డయితే?

రఘు—సరేనా...ఆ! ఇందాక సేవింగ్సులో పదిరూపాయలు వేశా?

కౌస—అగరే-మర్చిపోయాను.

రఘు—నాకు తెల్సు; నాకు తెల్సు. సేవింగంటే ఎరగని నువ్వా అది జ్ఞాపకం వుంచుకునేది? "అది ముందు రాయవే"అని మొత్తుకుంటూ - ఏం లాభం? చివరకు మర్చిపోతావ్ - ఆ! కూరలకు ఆరు రూపాయిలు-కూడా వెయ్యి.

కౌస—ఏం సరిపోతుం దండీ; మళ్ళీ కూర లేదంటే విసుక్కుంటారు.

రఘు—సరిపోవాల్సిందే; నే లెక్క వేశానంటే అంతే. పూటకు 0-1-6 కంటే ఎక్కువ వీల్లేదు; రోజుకు 0-3-0 చొప్పున, 30 రోజులకూ అయిదు రూపాయిలు. పైన ఎటు పోయి ఎటు వస్తుందోనని ఒక రూపాయి వేశా.

కౌస—మూడు ముప్పైలు తొంభై అండీ, పైన అరణాలే మిగిలేది.

రఘు—ఊఁ ? నా కంటె పెద్ద - Sub accoutant అయి పోయావే-ఊఁ-సరే...ఏడురూపాయిలు వేసుకో.

కౌస—ఊఁ-క్రిందటిసారి సత్తెమ్మ దగ్గర అప్పు తీసుకున్న రెండు రూపాయిలు యివ్వనేలేదు.

రఘు—వచ్చే నెలలో యివ్వకూడదూ ?

కౌస—ఎట్లా! ఆమె యిప్పటికే గోలచేస్తోంది.

రఘు—ఊఁ, సరే; తగలెట్టు.ఒక్కడాంట్లో Cooperation లేదు-ఖర్మం.

కౌస—పైన అయిదు రూపాయిలూ చేతిలో వుంచుకుంటాం.

రఘు—ఎందుకూ ?

కౌస—కావాలెండి-(Carrier) కారియర్ భోజనానికి.

రఘు—అహా ! సరే కానియ్యి...అయిపోయినట్టేగా ? ఊఁ Estimate కు కానీ మించకూడదు. తెలిసిందా...

కౌస—ఏం చెయ్యనండీ అవసరమయితే ?

రఘు—అయిందీ అప్పుడే ! తర్వాత ఏంచేసినా మానినా ఒప్పుకోనన్నా ఒప్పుకోవేమే ?

కౌస—ఒప్పుకున్నా లెండి.

రఘు—అ ! అల్లా వప్పుకో.—ఆ!—(ఏదో విన్నట్టు ఆగి) అదిగో రైలు కూతవేసిం దే.

కౌస—అ. కూసినట్టేవుంది !

రఘు—అరరరే. వెధవ అకౌంట్ కానుగానీ కొంప మునిగింది.

కౌస—ఏవరిదంటోయ్ ?

రఘు—ఎవరిదీ కాదు; ఈబండికి మా మామయ్య వస్తున్నాడు.

కౌస—మీ మామయ్యా! !

రఘు—ఆ! మా చిన్నమామయ్య.

కౌస—సరిపోయింది. ఈ Estimate యిప్పుడే మార్చాలి కాబోలు.

రఘు—ఫర్వాలేదులే! సాదరులో అయిదు, జేబులో పదీ వేశాంగా, నేను స్టేషన్‌కు వెళ్ళివస్తా.

కౌస—ఎందుకూ ? రాను పోనూ పావలా దండగ—ఊళ్ళో కొచ్చిన మామయ్య ఇంటికి రాడూ!

రఘు—వస్తాడ్లే...కానీ......

కౌస—తెరలోకిచూస్తూ:— కాసీ లేదు గీసీ లేదు వస్తాడు,... కాదు—వచ్చాడు అదిగో రిక్షా ఆగింది.

రఘు—అరరే!! అప్పుడే ఎట్లావచ్చాడూ! (ఎదురు వెళ్ళి మామయ్యతో వచ్చాడు.)

రఘు—రా! ఇటుకూర్చో. బండివచ్చే వేళయిందీ, ఇక బయలుదేరి స్టేషనికి వద్దామనుకుంటున్నాను. ఇంతలో నువ్వే వచ్చావ్.

మామ—బండీవచ్చి చాలసేపయింది. ఎందుకొచ్చిన అబద్ధాలురా. ఆఫీసున్నరోజున నీకు స్టేషన్‌కొచ్చే తీరిక వుంటుందని నే ననుకున్నానా ? ఆఫీసున్నరోజున ఆఫీసున్నది కనక తీరికవుండదూ—ఆఫీసు లేనిరోజున సినిమాకెళ్ళాలి:

గనక తీరికవుండదు. ఏమమ్మాయ్! యింకా మావాణ్ణి వెంటవేసుకుని సినిమాలకు తిప్పుతున్నావా?

కౌస—బాగుంది. నేను తిప్పుతున్నానంటారేమిటి? అసలు నేను ఆడవాళ్ళల్లో కూర్చుంటానని గోలపెడతాను. వాడు వింటేగా?

రఘు—ఇదిగో!—నేనా?...(కోపంగా ఆమెవంక చూసి ఆగి మామయ్యవంక తిరిగి) అదికాదు మామయ్యా! ఇంటి దగ్గర, ఆడవాళ్ళవైపు ఏం తోచదు—మీ దగ్గరే కూర్చుంటాననంటుంది. అక్కడకెళ్ళిన తర్వాత "మగవాళ్ళల్లో సిగ్గుగా వుంటుంది." మీతో రానంటుంది.

కౌస—సిగ్గుగా వుండదేమిటి మరీ—

రఘు—సిగ్గా! నీకు సిగ్గేమిటి—వేషం కాకపోతే.

మామ—ఇంతమాత్రానికే కొట్లాడుకుంటారేరా!

రఘు—కొంచెం గమ్మత్తుకిలే మామయ్యా.

మామ—గమ్మత్తుగా మాత్రం ఎందుకురా! నవ్వులు నువ్వులవుతాయన్నారు. మీ అత్తయ్యను చూడరాదూ! నవ్వుతూ ప్రారంభించి-ఏడుస్తూ ముగిస్తుంది.

కౌస—అదంతా ఎందుకులే బాబాయ్-పిన్నీ పిల్లలూ వాళ్లూ కులాసాయేనా.

మామ—ఆ! అదే కులాసా!

రఘు—ఏం? ఏమన్నా సుస్తీచేసిందా ఏమిటి?

మామ—అబ్బే-సుస్తీలేదు-కానీ అలవాటుకొద్దీ అన్నాలే. అడిగినవాళ్ళకి అట్లా చెప్పాలి. "కులాసాగా వున్నారా" అని అడిగినవారికి లేదని చెపితే సంతోషిస్తారు.

రఘు—అదేమిటి!

మామ—అది అంతే. నీ ఊహ్యప్రకారంకు ప్రపంచం తెలియదురా!

రఘు—కానీ అబద్ధాలు అనవసరంగా చెప్పటమెందుకూ?

మామ—అబద్ధాలు అనవసరం గనక నే చెపుతాం ఎప్పుడూ.

రఘు—కాని... అబద్ధాలు ......

మామ—మళ్లా అబద్ధాలంటావ్. అసలు ఈ ప్రపంచమే ఒక అబద్ధంరా! వేదాంతం, ఉపనిషత్తుల దగ్గర్నించీ అంతా అబద్ధం. తర్కం. అనుమానం. అన్నీ అంతే. అందాకా ఎందుకూ? ఆఫీసులో నీ ప్రక్కన కూర్చుని. నీ కాఫీ తనుతాగేసే స్నేహితుడు నీవిరోధి: నీతో కంటులర్ నీ బాతాఖానీ కొట్టీ సెకట్లుసిప్పూరాలుపిని, పైకి కన్నీళ్ళతో లోపల సంతోషించే పక్కగదివాడు నీకు ఆగర్భ శత్రువు.

రఘు—(నవ్వి) కానీ నువ్వేమన్నా అను, మామయ్యా! ప్రపంచంలో రకరకాల రంగులున్నాయి. ఒక్క ఆకు పచ్చరంగేకాదు.

మామ—అదే నీ పొరపాటు. రకరకాల రంగులు కలిస్తే ఆకుపచ్చ రంగుగానే కనిపిస్తుంది.

రఘు—కాని-నాఅదృష్టంకొద్దీ కాబోలు. అల్లా కనిపించటం లేదు. నాకు చక్కని స్నేహితులు; పై ఉద్యోగులూ క్రింద వుద్యోగులూ చుట్టుపక్కలవారూ-భగవంతుని దయవలన కలసివచ్చారు - చివరికి భార్యకూడా ...

మామ—అని నువ్వనుకుంటున్నావ్.

రఘు—కాదు. నిజంగాకూడా అంతే.

మామ—నిజం, నిలకడమీదకాని తెలియదు.

రఘు—నిలకడమీద తేల్చుకునే నేనీమాట అంటున్నాను.

మామ—అయితే నిజం తెల్సుకోలేని వెర్రిబాగులవాడివి నువ్వు - మీ హెడ్ గుమాస్తా వెంకట్రామయ్య అనే ఆయనేగా? నిన్ను ఎప్పుడూ కనిపెట్టి వుంటున్నాడుగా?

మామ—క్రింద గుమాస్తాలు కృష్ణారావు- కృపానిధీ కాదూ! వీళ్ళేగా పాపం బహు నమ్మకమయినవాళ్ళు! - పక్క యింటాయన పాపారావు నేనెరుగున్నానులే! మహా ప్రయోజకుడు.

రఘు—అవును, వాళ్ళందరూ చాలామంచివాళ్లు కాదని ఎల్లా అంటున్నావో నాకర్థంకావటంలేదు.

మామ—అర్థమయితే కాదని నువ్వే అంటావ్.

రఘు—అయితే ఇదీ? (భార్యనుచూపి) ఇది కూడా మంచిదికాదంటావా? నువ్వనేమాటల్లో దేన్నీ నమ్మలేను. ఎవర్నీ అనుమానించను. అనుమానిస్తే ఒక్క దీన్నేగాని. (భార్యవంక చూస్తాడు)

కౌస—చాల్లెండి పనిపాటా లేకపోతేసరి. అనుమానమట- అనుమానం. ఏం అనుమానిస్తారు ?

రఘు—అనుమానించక ఏం చెయ్యను? ఎప్పుడు ఏ కాఫీలో ఏమందు కలిపియిచ్చావో-గాని- ఇల్లా పాదదాసుణ్ణయి పడివున్నానుగదా! (పాదాలవద్ద మోకరిల్లుతాడు)

సూరమ—ఛీ ఛీ - ఇదేం పనిరా చేస్తున్నావసలు సిగ్గు లేకుండా?

రఘు—నీసంగతి నాకు తెలుసులే సూరమయ్యా! ఇచ్చేం విన్నా అత్తయ్యాసూ ఎరగని వాణ్ణా.

కౌస—బాగానేవుంది పెద్దాచిన్నా లేకుండా. వెళ్ళి కాఫీ కాచుకు వస్తాను. వాణ్ని కాస్త కూర్చోమనన్నా అనలే మీరింతవరకూ.

సూరమ—వాడికింకా ఏం తెలియదులే అమ్మా! చిన్న సన్యాసి.

కౌస—ఆ - చిన్న సన్యాసే! ఎన్నా. (వెళుతుంది)

సూరమ—(నవ్వి) నేను చాలా అర్జెంటుపనిమీద వచ్చానురా? అర్జెంటంటే మరీ అర్జెంటేం కాదనుకో. కాని సాధ్యమైనంత తొందరగా జరగాలి. చూశావ్రా! పెద్దమ్మాయికి తొందరగా పెళ్ళి జరగాలి. పెళ్ళి విషయంలో తొందర పడకూడదని నాకు తెల్సు. కాని అది యింత తొందరగా రజస్వల అవుతుందని అనుకోలేదే.

రఘు—అయితే ఏదన్నా సంబంధం చూడమంటావా ఏం?

సూరమ—వద్దొద్దు. నే చూసినవి చాలు. నే నిప్పటికే పదిహేను చూశాను. ఒక్కటిచాలు మా అమ్మాయికి. చూశావ్-ఓ నాలుగైదు సంబంధాలు ఈ వూళ్ళోనే వున్నాయి. వాటిసంగతి తెల్సుకుందామనే వచ్చాను. ఆ చూడు! మీ హెడ్ అకౌంటెంట్‌గారికి ఒక అబ్బాయి వున్నాడుగాదూ?

రఘు—ఉన్నాడు కాని...ఉత్త మొద్దే.

మామ—మొద్దయితే ఏం! ఆస్తివుంది-ఫర్వాలేదు.

రఘు—సరే దానికేం! కనుక్కుందాం.

మామ—కొంచెం గట్టిగా కనుక్కో.

(బయటనించి "రఘునాథరావుగారూ రఘునాథ రావుగారూ!" అని కేక వినిపిస్తుంది)

మామ—ఎవరది ?

రఘు—మా ఆఫీసులో గుమాస్తాలు (కృష్ణారావు,కృపానిధీ)

మామ—వాళ్ళైనా! సరే ?

రఘు—(వాళ్ళను చూచి) రండి! కూర్చోండి.

[కృష్ణారావు, కృపానిధి వస్తారు]

కృపా—మరేంపనిలేదు. ఆఫీసుకుపోతూ తమ దర్శనం చేసుకు పోదామని వచ్చాం. (మామయ్యనుచూసి ఎగాదిగా పరికించి ఖంగారు పడ్తారు)

కృష్ణ—ఇవ్వాళ మావాళ్ళింట్లో భోజనమండీ, కొంచెంఆలస్య మవుతుంది......అందుకని......

(మామయ్యను చూపించి, కృపానిధి అతన్ని వెనక్కు లాగుతాడు.)

రఘు—ఏమి టట్లా ఖంగారు పడ్తారు?

కృపా—ఏం లేదూ......వీరూ...వీరూ...

రఘు—వీరా! మా మామయ్యగారు.........విశ్వనాథం గారని.........

మామ— ఆ—ఆ...వీడికి మేనమామను లెండి.

కృపా—చిత్తం—మాకింతవరకూ తెలియదండి.........
తెలిస్తే.........

మామ—తెలిస్తేమాత్రం ఏం లెండి. మీపొట్ట మీరు పోసుకుంటున్నారు.

కృపా—అహాహ...!...(నవ్వి) నమస్కారం.

కృష్ణ—నమస్కారం,

మామ—నమస్కారాలు. వీరిద్దరికీ నాకూ యిదివరకు కొంచెం పరిచయముందిలేరా! అందువల్ల ఖంగారు పడుతున్నారు. ఫర్వాలేదు లెండి; భయపడకండి. వీరిద్దరూ బహు మంచివాళ్లురా రఘూ! చాలా మంచివాళ్లు.

రఘు—ఒక్క ఆఫీసులో పనిచేస్తున్నాం. నాకు తెలియదా ఆసంగతి?

మామ—ఏదో పైగుమాస్తావిగా; ఇద్దర్నీ కనిపెట్టివుండు.

కృపా—ఏదో లెండి. వారిదయవల్లే ఇల్లా బ్రతుకుతున్నాం. యిహా మేం వస్తామండీ. (నమస్కారంచేస్తూ అంటాడు.)

రఘు—ఆ. వెళ్ళిరండి.

కృపా—మామయ్యగారికి నమస్కారం పెట్టవేరా!

కృష్ణ—నమస్కారమండీ—(వెళ్తారు. మామయ్య నవ్వుతాడు.)

రఘు—వీళ్ళిద్దరూ నీకెట్లా తెలుసు?

మామ—అబ్బాయ్—ఈ జీవితంలో అనేకమందిని అనేక సార్లు అనేకరకాలుగా కల్సుకుంటుంటాం. మనం

చేసుకోవటం ముఖ్యంగనక. అందరిసంగతి అన్నిసంగతులూ పట్టించుకోకూడదను అందువల్ల లాభంలేదు. ఏమంటావ్?

రఘు—నోరుమూసుకోమన్నావ్...ఇంకేమంటాను?

[పాపారావు రఘునాథంగారున్నారా అండీ అంటూ వస్తాడు.]

రఘు—రండి రండి-ఇట్లా కూర్చోండి.

(పాపారావు-మామయ్యను చూసి తెల్లబోయి ఖంగారు పడ్తాడు.)

రఘు—ఏం పనిమీద వచ్చినట్లున్నారు...?

పాపా—వేరే......వేరే......పనేంలేదు......కాని...కాని......

రఘు—పోనీ.చూడండి. కూర్చోండి. వీరు మా మామయ్యగారు.

పాపా—అలాగా అండీ; నే నెరగనండీ; మీ మామయ్యగారేనా స్వయానా...మీ...

రఘు—ఆ-స్వయానా మా మామయ్యే.

పాపా—అంటే మీసొంత...మామ...

రఘు—ఆ. నాసొంతమామయ్య-మా అమ్మగారికి స్వయానా తమ్ముడు.

మామ—వారిపనుసు యిక్కడ లేదులేరా రఘూ,—పోనీ నే నవతలకు వెళ్తాను. మీరు మాట్లాడండి.

పాపా—ఎందుకండీ,... నేనే... నేనే...తత్తర్వాత వస్తాను. వస్తా. (వెళతాడు.)

(రఘుతిరిగి "ఇతనూ...—నీకు తెలునా అని అడగ బోతాడు.)

మామ—అబ్బాయ్......(అని తిరిగి ప్రారంభించబోగా—రఘు అర్థం చేసుకుని)

రఘు— సర్లే. సరే.....

మామ—(నవ్వుతాడు)

(కౌసల్య మూడు గ్లాసులతో కాఫీ తీసుకువస్తుంది)

మామ—అమ్మాయి తొందరగానే కాఫీ కాచుకువచ్చిందే?

రఘు—తొందరగా-వచ్చిందంటావా !!

మామ—అదేలే ! తొందరంటే ఆలస్యం అనే అర్థం.

రఘు—ఇదేమిటి మూడుగ్లాసులు తీసుకువచ్చావ్?

కౌస—ఎవరో మరొకరు మాట్లాడుతున్నట్లు వినిపిస్తేనూ ?

మామ—ఓహో. కానీ ఆయన వెళ్ళిపోయాళ్ళే. ఆ కాఫీ నువ్వు త్రాగు.

రఘు—అది త్రాగకుండానే నీకూనాకూ కాఫీ తెచ్చియిస్తుం దనుకున్నావా ?

కౌస—అవును నే త్రాగకుండానే ముందు మీకెందు కివ్వాలేం?

రఘు—ఇంకేం చెప్పను? మీరోజుల్లో కూడా ఆడవాళ్ళు ఇల్లాగే వుండేవారా ! మామయ్యా !

మామ—ఇల్లాగ అని చెప్పలేం. కాఫీ ముందువాళ్ళే తాగినా తాను-తాగానని చెప్పేవాళ్లు కాదు. మన తర్వాతే మాత్రం కాఫీ మళ్లా తాగేవాళ్ళు. (అందరూ నవ్వుతుండగా "రఘునాథరావ్-రఘునాథరావ్" అని కేక విని పిస్తుంది.)

రఘు—ఎవరూ! మా హెడ్ అకౌంటెంట్ గారు లాగుంగే రండి...రండి.

[వెంకట్రామయ్య వస్తాడు. కౌసల్య వెళ్తుంది.]

వెంక—ఉన్నావా. ఉంటావనే అనుకున్నా. అనుకునే వచ్చా.

మామ—నమస్కారమండీ! వెంకట్రామయ్యగారూ.

వెంక—ఆ! మీరా! నువ్వు ఒంటరిగా వుంటావనుకున్నానే!

రఘు—ఫర్వాలేదు లెండి, వీరు మా మామయ్యగారు.

వెంక—వీరా!! మీ మామయ్య-!-!- అల్లాగా-! నాకు తెలియదే!

మామ—మీకు తెలియటమెందుకని నేనే చెప్పలేదు లెండి.

వెంక—అయ్యయ్యో! ఒక్కసారి చెప్తే ఏంపోయిందండీ... వస్తా...రఘునాథరావ్... ఈ కాగితాలు కొంచెం చూశి పెడ్తావేమోనని వచ్చా, నాకు పని తెముటలం లేదు.

రఘు—ఓ అల్లాగే! యిచ్చి వెళ్ళండి చూస్తాను.

వెంక—అల్లాగే-చూద్దువుగాని-వస్తా- (కాగితా లివ్వకుండా వెళ్ళబోగా)

రఘు—కాగితాలివ్వకుండా వెళ్తున్నారేం ?

వెంక—ఆ !– కాగితాలా ! ఇవ్వమంటారా ?

రఘు—ఆ–ఇవ్వండి.

వెంక—ఒద్దులే చేసే ! చూస్తా–ఎల్లాగో అల్లా టీక చేసుకుం టాలే. నిన్ను కష్టపెట్టట మెందుకు–ఈమాత్రం దానికి. వస్తా...రానా అండీ ?

మామ—రండీ (వెంకట్రామయ్య వెళ్తాడు)

రఘు—(సందేహిస్తూ) ఈయనా... నీకు ? ...

మామ—ఆ. అయనా...నాకూ — —

రఘు—ఎల్లా తెల్సునని అడగచ్చా ?

మామ—(నవ్వి) అడగకూడదు.

రఘు—సరే. కానీ ఈయనగూడా మంచివాడు కాదనేగా నీ వుద్దేశ్యం–

మామ—కాదనే కాని మంచితనమంటే నీఉద్దేశ్యమేమిటి ?

రఘు—చెడ్డవాడు కానివాడని,

మామ—ఫర్వాలేదు. పరాయివాడి నెత్తిన చేతులెట్టని వాడల్లా మంచివాడనలేదు.

రఘు—అయితే నీఉద్దేశ్యంలో మంచివాడెవరంటావ్ ?

మామ—ఏపనీ చాతకానివాడు మంచివాడు–అంతమంచివాడు సాధారణంగా దొరకడనుకో.

రఘు—అయితే గాంధీమహాత్ముడుకూడా అ . తేగా ?

మామ—అంటేనంటే చెడ్డవాడున్నాడా ! [illegible] ఏమన్నా వుం ? అంటా కా ఎకదుకూ ? ఆ [illegible] ఖుసి చేశారు ?

రఘు—అది ఎవరో వెధవలు ...

మామ—నిజమే లే! ఆ సంగతి నాకు తెలియక కాదు, కానీ ఆ వెధవలకి గాంధీగారు చెడ్డవాడేగా! అభ్యాయ్ మంచితనం గానీ, చెడ్డతనంగానీ! ఆలోచించేవాడి ఆత్మగుణాన్ని బట్టి వుంటుంది. మంచివాళ్ళకు మంచివాడు - మంచివాడు. చెడ్డవాళ్ళకు చెడ్డవాడే మంచివాడు.

రఘు—ఇందాక మంచివాడు లేడన్నావ్. ఇప్పుడు ప్రపంచంలో మంచితనమే లేదంటున్నావ్. కానీ నా కంటికి చెడ్డవాళ్లెక్కడా కనిపించటంలేదు.

మామ—వాళ్ళందర్నీ నువ్వు మంచిగానే చూస్తున్నావు గనక, కాని మరొక్కసారి చెడుగా చూడు. ఈ తడవ వాళ్ళు వచ్చినపుడు వాళ్ళ ప్రతిచర్యకూ, ప్రతిమాటకూ నీకు తోచిన అర్థం కాక-వేరే అర్థం వుంటుందేమో చూడు-ఆ-మరొకటి; నిన్న నువ్వు ఆఫీసు కెళ్లావుగా?

రఘు—ఆ-వెళ్ళా.

మామ—నీ క్రింది గుమాస్తాల నేమన్నా కోప్పడ్డావా?

రఘు—లేదు.

మామ—వాళ్ళు వ్రాసినదాన్ని కాదన్నావా?

రఘు—అనలేదు.

మామ—అయితే మరీ మంచిది.

రఘు—నేను మంచి వాళ్ళనుకుంటున్న వాళ్ళనే చెడ్డగా చూడటం ఎలా?

మామ—దాన్నే "అనుమానం" అంటాం. ప్రతిదీ మనం అనుమానించాలి. అదిగో వాళ్ళొస్తున్నట్లున్నారు. ఊరుకో !

[కృష్ణారావు వస్తాడు]

కృష్ణా—నమస్కారమండీ, క్షమించాలి.

రఘు—ఏం? మళ్ళా వచ్చారు?

కృష్ణా—ఏం లేదు. ఇక్కణ్ణించి వెళ్ళానా అండీ. వెళ్ళంగానే వుత్తర మొచ్చింది-మావాళ్ళను అర్జంటుగా పుట్టింటికి పంపాల్సి వచ్చింది. అందుకని...యివ్వాళ-రొండు రోజులు సెలవు కావాలి.

రఘు—సెలవు పెడతారా !

కృష్ణా—చిత్తం. అప్లికేషన్ వ్రాసి తీసుకు వచ్చాను. (తీసి యిస్తాడు)

రఘు—(చూసి) ఊఁ! కానివ్వండి.

కృష్ణా—చిత్తం. ఇవ్వాళ వెళ్ళవలసిన కాగితాలన్నీ మీ బల్లమీద Put-up చేసి పెట్టాను. మళ్ళీ రేపు ఆఫీసు వేళకు వచ్చేస్తాను. అర్జంటు కాగితాలేం లేవు గాని యండీ......

రఘు—కానీ...

కృష్ణా—"నా రా య ణ రా వ్" అని కంట్రాక్టరున్నాడు చూడండి.

రఘు—ఆ! ఆ! చేవూరు బ్రిడ్జి...కంట్రాక్టర్.

కృష్ణా—ఆ! అతని కాగితం ఒక్కటి వుంది. బాగా పిలుగా వున్నపుడు చూడొచ్చు లెండి.

రఘు—అల్లాగే లెండి.

కృష్ణా—ఏంలే-వాడు చిన్నవే తొందరపెట్టి వేధించుటు. ఇవ్వాళ పంపుదాం కదా అనుకున్నాను ఇంతలో యిలా వెళ్ళాల్సి వచ్చింది.

రఘు—సరే లెండి.

కృష్ణా—చిత్తం. సెలవండి! వస్తానండి, రేపు ఆఫీసువేళకు వచ్చేస్తానండి. (వెళతాడు)

రఘు—చూశావా!

మామ—ఆ చూశా.

రఘు—అలాగ అడకువా-సత్రమతా?

మామ—చాలా బాగుంది.

రఘు—అతని మాటలన్నీ నువ్వు అనుమానిస్తూనే విన్నావుగా?

మామ—అనుమానిస్తూనే విన్నా!

రఘు—ఇకనన్నా ఎదటి వాడి మాటలు అనుమానించకుండా వినటం నేర్చుకో.

మామ—నేర్చుకుంటా!

రఘు—కౌసల్యా! కౌసల్యా!

మామ—అమ్మాయిని పిలుస్తున్నా వెందుకు?

రఘు—నీకేమన్నా మంచినీళ్ళు కావాలేమోనని.

మామ—అక్కర లేదు.

రఘు—పోన్లే నాకెక్కవాలి; కౌసల్యా !

కౌస—(వచ్చి) ఏం ! ఎక్కడికి వెళ్ళేననుకున్నారూ అంత గట్టిగా అరుస్తున్నారు?

రఘు—ఏమో ! ప్రతిదాన్ని అనుమానించవలసి వస్తున్నాదు మామయ్యా. ఎక్కడున్నావింతసేపూ ?

కౌస—దొడ్లో !

రఘు—దొడ్లో-ఏంచేస్తున్నావ్ ?

కౌస—దొడ్లో-అంట్లు తోముతున్నాను.

రఘు—అంట్లా ! ఇందాకే తోమేవుగా.

కౌస—ఆ తోమినవే మళ్ళా తోముతున్నాను. ఇంకు కేనా పిల్చింది?

రఘు—కాదు, కాదు, కాసిని మంచినీళ్లు తెచ్చిపెట్టు.

కౌస—అలాగే ! (వెళ్తుంది)

రఘు—ఇది దొడ్లో ఏంచేస్తోందని అనుమానిద్దామా...

మామ—వద్దులే. అలా ఆలోచిస్తే అసలు నిద్రఉండదు.

రఘు—సరే...అరే !! కృపానిధి వస్తున్నాడే-రాసి ! వీణ్ణి తెగ అనుమానిద్దాం.

(కృపానిధి వచ్చాడు)

కృపా—నమస్కారమండీ-నమస్కారమండీ ?

రఘు—నమస్కారం-ఏం మళ్ళీవచ్చారు?

కృపా—మరేంలేదండీ; ఊరికినే...ఇటు వెళ్తూ...

రఘు—ఏముంటోయ్-జాగ్రత్తగా మాట్లాడండి అసలే నా కనుమానంగా వుంది.

కృపా—అనుమానమా! ......నామీదా! ...... ఎప్పట్నించీనండీ!...

రఘు—ఇప్పుడే. మా మామయ్య చెప్పాడు. అప్పట్నించీ.

కృపా—మామయ్యగారా! చెప్పారా? (వణికిపోతాడు)

మామ—నేను మీగురించి ఏం చెప్పలేదులెండి. మొత్తం మీద ప్రతిదీ అనుమానిస్తూ చూడమని చెప్పాను – అందుకని......

రఘు—(నవ్వి) వేళాకోళంగా అంటున్నాం లెండి. గాభరా పడకండి–ఇంతకూవచ్చినపనీ...?

కృపా—గాభరాపడిపోయాను. వచ్చిన పనా–చెప్తా–కానీ...

రఘు—కానీ...

కృపా—అనుమానించరుగదా?

రఘు—లేదులెండి, చెప్పండి.

కృపా—ఏంలేదు ఇవ్వాళ కొంచెం csual-leave కావాలండీ.

రఘు—కాజుయల్ లీవా?

కృపా—ఆ! ఒక్క–రోజేనండీ. మా యింట్లో మా పెద్ద మ్మాయికి జ్వరం–అమాంతంగా వచ్చింది. దానికి మందు తేవాలి. పైగా దానికి జ్వరంవస్తే "నాన్నా! నాన్నా!" అంటూ ఒదిలిపెట్టదు. పైగా మా ఆవిడకూడా లంఖ నాలు పడి లేచిన మనిషి. పనిచేసేది కూడా రానని చెప్పి వెళ్ళిందిట.

2

రఘు—కానీ-కృష్ణారావు కూడా సెలవుపెట్టి వెళ్ళాడే.

కృపా—కృష్ణారావా! సెలవుపెట్టి వెళ్ళాడా?

రఘు—ఆ! వాళ్ళావిడను అర్జంటుగా పుట్టింటికి పంపాల్సి వచ్చిందనీ.

కృపా—వాళ్ళావిడనా?

రఘు—ఆ-?

కృపా—కానీ-వాళ్ళావిడనూ — — —!

రఘు—పనంతా చేసిపెట్టి వెళ్తున్నాను. రేపు ఆఫీసువేళకు వచ్చేస్తానని చెప్పాడు.

కృపా—ఆహా-అలాగా అండీ-!

రఘు—ఏం! అలా తెల్లబోయారేం! కావాలంటే మీరూ! సెలవుపెట్టండి !

కృపా—అహ-సెలవుకాదండి ఈ యిబ్బందులవల్లగానీ లేక పోతే - సెలవుపెట్టేవాణ్ణే! కాని ఆ నారాయణరావు బిల్లుంది చూశారూ-చేవ్రాలు బ్రిడ్జిది.

రఘు—ఆ. ఆ! "అది యివ్వాళ Pass చేయాలి. అతను నిన్ననే తొందరపెట్టాడు" అని చెప్పి వెళ్ళాడు.

కృపా—pass చేయమని చెప్పి వెళ్ళాడా? ఉహూ. —.

రఘు—ఏం! అల్లా అనుమానిస్తారేం-! మానుయ్యా మాకూ చెప్పలేదుగదా!

కృపా—చెప్పలేదుగాని ... దానిమీద ఏవో Objections వున్నట్లు జ్ఞాపకమండీ. అందుకని నేను అనుమానిస్తున్నా............

రఘు—Objections వుంటే ఆపేద్దాం.

కృపా—అహాహా—! చూడకుండా pass చేస్తారని కాదు.

రఘు—సరే. చూస్తాలెండి. మీ సెలవు కాగితం ఆఫీసుకు పంపండి.

కృపా—అలాగే సెలవండి. వస్తానండీ. (వెళ్తాడు)

రఘు—ఇవన్నీ చూశావా? అతని కాగితాలే కాదు ఆఫీసు పనంతా తనదిగా చూసుకుంటాడు. పాపం

మాను—పాపం. ?

రఘు—హోన్లే; చచ్చేటట్టు చాకిరీ చేసినందుకు ప్రతిఫలంగా— నీచేత "పాపం" అనిపించగలిగాడు.

మాను—కాని - - !

మామ—ఆ మొదట్లో మాస్తా కృష్ణారావు ఈ అభ్యంతరాల గురించి చెప్పలేదే . !

రఘు—సరిగ్గా చూడలేదేమో ?

మామ—అంత చూడకుండా Bill Pass చేయటానికి పెడ్తాడంటావా?

రఘు—మళ్ళీ అనుమానిస్తున్నావ్ !

మాను—పోనీ—మనసామ్మేం పోయిందీ? ఒక్కరవ్వ అనుమానిద్దాం. అభ్యంతరాలుండగా pass చేస్తే అది నీ పీకకు చుట్టుకుంటుందిగా ?

రఘు—నే సరిగ్గానే చూస్తాగా ?

మామ—ఇప్పుడీ కృపానిధి చెప్పకపోయినా సరిగ్గా చూశేవాడివేనా ?

రఘు—ఆ-! సరిగ్గాచూడందే - ఏ కాగితంమీదా సంతకం పెట్టను.

మామ—ఇప్పుడర్థమయింది-నీదగ్గర వాళ్ళెందుకు అణకువగా వుంటారో. నువ్వు ప్రతికాగితం సరిగ్గా చూస్తావ్, అంటే అనుమానిస్తూ చూస్తావ్—కనకనే వాళ్ళకీ అణకువ - భయం.

(ఆలోచిస్తూ రఘునిల్చిపోతాడు-కౌసల్య మంచినీళ్లు పట్టుకువస్తుంది.)

రఘు—ఎవరి కివ్వ ? ...

కౌస—మీరే కావా లన్నారుగా ?

రఘు—ఆ-అవును, (నీళ్ళను పరీక్షగా చూసీ, వాసన చూసీ- కిందపార బోసీ-చూస్తాడు)

మామ—అదేమిటి ! పారబోసి చూస్తున్నావ్?

రఘు—అహ ! ప్రతిదీ అనుమానించ మన్నావుగా ? ఈ మహా యిల్లాలు దీంట్లో ఏమన్నా......?

కౌస—"కలిపిందా" అని ? బాగానే వుంది,

మామ—ఛ. ఛ. అదేమిట్రా !

రఘు—అయితే దీంట్లో ఏదో వుందని నాకేం పెద్ద అనుమానం లేదులే; ఇది చంపదల్చుకుంటే ఏ అర్ధరాత్రో గొంతు పిసికి చంపుతుంది గాని, ఇల్లా షోకుగా విష మిచ్చి చంపదు. కనక మంచినీళ్ళు తాగవచ్చు.

మామ—అయితే తాగు !

రఘు—తాగుతాను సరే—కాని... నీకన్న అనుమానం కదా—
(త్రాగుతాడు)

కౌస—ఇహ ఆగ్లాసు యిట్లా యిన్వండి?

రఘు—ఇవ్వను. నీ కివ్వను—ఈ గ్లాసు నువ్వు దగ్గరుంచుకో
మామయ్యా. ఒకవేళ, నేను ఈ మంచినీళ్లు ఎల్లాగూ
త్రాగేను గనక—ప్రాణాలు వదిస్తే—ఈ గ్లాసు పరీక్ష
చేయించ వచ్చు. నువ్వు వద్దుంచుకో.

మామ—ప్రాణా లొదలటం దాకా ఎందుకురా! అను
మానం తగలగానే డాక్టర్ని పిలిచి విరుగుడు మందిప్పిం
చనూ?

రఘు—అయితే గ్లాసు యివ్వవచ్చుంటారా! యిచ్చేస్తా
కాని నువ్వు కొంచెం నా మొహం కాస్త కనిపెట్టివుండు.

మామ—నీ మొహం. అందుకు సందేహమా?

కౌస—నా మొహంలావుంది. ఇంట్లో కూరల్లేవు. కాస్త
బజారు కెళ్లి తీసుకు రారాదూ ఇల్లా కూర్చోక పోతే!

రఘు—చూశావా! మామయ్యా! ఆ మాటల అర్థం
చూశావా! యింట్లోంచి get out అంటున్నది.

కౌస—లేకపోతే ఏమిటి 24 ఘంటలూ ఇంట్లోచేరి. (లోపలకు
వెళ్లిపోతుంది)

పాపా—[ప్రవేశిస్తాడు] వెళ్తున్నారా కౌసల్యగారూ కొంచెం
ఆగండి; ఈ సంచీ తీసుకు వెళ్ళండి. కందులు లెండి.
మావాళ్ళు మాకు నాలుగు మానికలు పంపారు.
దాంట్లో ఓ మానెడు మీా కిచ్చి రమ్మని మా ఆవిడ...

కౌస—(తీసుకు పోతుంది)

పాపా—వస్తానండీ! వస్తా (ఆగి) మీరు బజారు కెళ్తారా యీపూట ?

రఘు—నేనా! ఎందుకూ?

పాపా—ఆ–ఏం లేదు–వెళ్తే–నాక్కొ–ంచెం పనుంది; అందుకని.

రఘు.—ఏమిటి ?

పాపా—ఏం లేదు. మీకు వీలైతే నాలుగు నిమ్మకాయలు తీసుకు రండి. అంతే

రఘు—కాని–నే వెళ్లనే!

పాపా—వెళ్ళరూ! సాధారణంగా ఈ సమయంలో యింట్లో వుండరుగదా! వెళ్తారనుకున్నా. పోన్లెండి నేనే వెళ్ళి తెచ్చుకుంటూ–వస్తా. (వెళతాడు)

రఘు—(నవ్వి) ఆయనమీద కూడా నీ కనుమానం లేదూ ?

మామ—అబ్బే! వీరిమీద నా కనుమానం లేదు కాని అసహ్యం వుంది.

రఘు—ఏం ?

మామ—వీరూ నేనూ మొన్న ఒక్క రైలు పెట్టెలో ఎక్కాం.

రఘు—ఎక్కితే–?

మామ—ఎక్కితే నాకేంలే. మా ఎదురుగుండావున్నాయన అమాంతం లేచి ఈయన్ని నాలుగు ఉతికాడు.

రఘు—అరే! ఎందుకూ?

మాను—ఏంలే! వాళ్ళావిడకాలు ఈయన నాలుగు సార్లు తొక్కాట్ట.

రఘు—అరే! అటువంటివాడు కాదే!

మాను—అటువంటి వాడేనని పూర్తి నమ్మకంతోనే ఆయన నతికే నాలుగూ ఉతికాడు.

రఘు—పాపం

మాను—కాని ఆవేళ నాకూ యీాయనమీాద జాలిగాలేదు. ఇదంతా ఎందుకురా! ప్రతిమనిషీ మంచివాడిగా కని పిస్తాడు. మాటలు తియ్యగానే వుంటాయి. ఆ మాటలు చూశి మోసపోకూడదు.

రఘు—నీ మాటలు విని నేనింతవరకూ యీాత Cynic వని అనుకోలే.

[వెంకట్రామయ్య వస్తాడు]

వెం—ఉన్నావా-రఘూ! మీారింకా వెళ్ళలే?

రామ—నే నివ్వాళ వుంటాలెండి. మీారేమన్నా మాట్లాడు కుంటామంటే మాట్లాడుకోండి, నేనవతలకు వెళ్తాడు

వెంక—అక్కర్లేదండీ. ఎందుకూ? ఆ! రఘునాధరావూ! చూడూ-ఆ నారాయణరావు bill ఒకటుందిట. తొందరగా pass చేయమని గోలపెడ్తున్నాడు ఏదోచూశి తగలెట్టు-యివ్వాళ-ఆఫీసుకెళ్ళి ఆకాగితాలు తెచ్చాన్లే. ఇంద (file యిస్తాడు)

రఘు—అల్లాగేలెండి. కాని యివ్వాళ ఆఫీసులో అందరికీ నారాయణరావు bill సంగతే పట్టినట్లుందే.

వెంక—పాపం మరీ గోలపెడుతున్నాడు. ఏదో చూడు నేనేం అభ్యంతరం పెట్టనులే.

రఘు—కాని ఏవో objections వున్నాయట-

వెంక—ఆ-ఏముంటాయిలే! నువ్వన్నీ ఒక్కసారి చూసి pass చెయ్యి-ఆ. నేను-రానా! మరి.? వస్తానండి (అని వెళ్ళబోయి) ఆ-నేనూ ఆఫీసుకు కొంచెం ఆలస్యంగా వస్తాను-మా వాళ్ళింట్లో ఆబ్దికంలే. నువ్వు తొందరగానే వెళ్తావుగా.

రఘు—ఆ. వెళ్తా. (వెంకట్రామయ్య వెళతాడు.)

మామ—ఈయనా ఆ bill కోసమే వచ్చాడా?

రఘు—ఆ-పాపం అడిగినవాణ్ణి కాదనలేడు.

మామ—అంతేనా! ఆ bill pass చేస్తే ఈయన కేమన్నా ముట్టుతుందా?

రఘు—నీ అనుమానం చూస్తే నవ్వొస్తోంది మామయ్యా!

మామ—నవ్వితే నవ్వు!

రఘు—ఆయన నిప్పులాంటి మనిషి.

మామ—నిప్పుకూడా నుసిపడ్తుంది.

రఘు—అయితే ఈయన లంచాలు తీస్తున్నాడంటావా!

మామ—నన్ను కూడా వకసారి లంచం అడిగాడంటాను.

రఘు—నిన్నా!!

మామ—ఆ. నన్నే ! మీ ఆఫీసులో నాకొక పనికావాల్సి వచ్చింది. నువ్వు కావల్సినవాడివిగనక–నీతో చెపితే నా పని అవదు. అదినాకు తెలుసు. నిన్ను మొహమాట పెట్టటం, నువ్వాపనిచేయలేక పోవటం ఎందుకని–వారినే అడిగాను. వారు మొహమాటం లేకుండా కావాల్సింది పుచ్చుకుని పని చేసిపెట్టారు.

రఘు—నా రంటే...?

మామ—నీపైన వాడు ఈయనా, నీ క్రిందివాళ్ళు వాళ్ళూ.

రఘు—నిజంగా !

మామ—నిజంగానే ! అందుకనే నన్ను చూచి ఖంగారు పడ్డారందరూ. పోతే–ఇప్పుడు యీ Bill విషయం నాకొంచెం అనుమానంగావుంది. కొంచెం జాగ్రత్తగా చూచి Pass చెయ్యి.

రఘు—ఆ విషయంలో అనుమానం అక్కరలేదు. జాగ్రత్తగానే చూస్తాను.

మామ—అనుమానం అక్కర్లేదనకు–మనం ప్రతిదీ అనుమానించాలి. ఆఫీసులో కాగితాలే కాదు. నీ జేబులో కాగితాలుగూడా ఎప్పుడూ కళ్ళు మూసుకొని నమ్మవద్దు.

రఘు—(నవ్వి) నా జేబులో కాగితాలమీదకూడాఅనుమానమేనా, కావాలంటేచూసుకో, ఇవిగో, నా జేబులో కాగితాలు.

ఇదిగో! (Purse) ఇదిగో నిన్న నువ్వు వ్రాసిన ఉత్తరం ఇదిగో బట్టలకొట్టు బిల్లు ఏమిటోయిది ?... (చదివి) ఏమిటిది ?

మామ—ఏమిటది ?

రఘు—ఏదో ఉత్తరం.

మామ—ఏం ఉత్తరం?

రఘు—ఏదో "ప్రేమ ఉత్తరం"

మామ—ఎవరు వ్రాసింది ?

రఘు—ఏమో తెలియదు. నా జేబులో కెట్లావచ్చిందో !

మామ—బాగానేవుంది. చేనేదో ఫ్యూరికే అన్నమాటా...

రఘు—ఏదో పొరపాటున వచ్చివుంటుంది. సరే. తర్వాత చూద్దాం. ఈ Bill సంగతేదో ముందుచూసి...

మామ—అల్లాగే కానియ్యి. నేను కూర్చుంటాలే!

(రఘు కూర్చుని ఆఫీసుకాగితాలు చూస్తుంటాడు)

కాసేపటికి (బయట రఘునాథరావుగారూ అని కేక)

రఘు—ఎవరది ?

కొత్త—నేనండీ. శ్యామలరావును.

రఘు—అహా ఏవూరు మీదీ ?

కొత్త—ఈఊరేనండీ! నన్ను మీ రెరుగరూ?

రఘు—ఎరగనండీ.

మామ—వీరినే ఎరగవట్రా. వీరు సి. ఐ. డి. ఇనస్పెక్టర్ గారు.

కొత్త—మీరు నన్నెరుగుదురా ఏమిటి ?

మామ—నిన్నెరక్కపోవటమేమిటయ్యా ! నువ్వు నా వెంట తిరగటం కూడా చేసెయగుదున్లే.

కొత్త—నేనా, మీ వెంటా !

మామ—ఆ, నా వెంటే. అయితే నేను అనుకోలేదు లే!నువ్వు ఎవరికోసమో నా వెంట తిరిగావ్. ఇంతకూ నాకోసం కాదుగా నువ్వొచ్చింది.

కొత్త—అబ్బే! కాదండి వీరికోసమే. కొంచెం-Information కావాలి. రఘునాధరావుగారూ-

రఘు—చెప్పండి. ఏంకావాలి?

కొత్త—చూడండి, నారాయణరావు అని ఒక కంట్రాక్టరున్నాడూ...

రఘు—ఆ, వున్నాడు.

కొత్త—అతని బిల్ ఒకటి మీ ఆఫీసులో వుందిట. చేవ్రూరి బ్రిడ్జిది.

రఘు—ఆ! వుంది.

కొత్త—అది Pass అయిందాండీ.

రఘు—ఇవ్వాళ అవుతుంది.

కొత్త—ఇంకా అవలేదన్నమాట.

రఘు—లేదు.

మామ—మావాడింకా ఆఫీసుకి వెళ్ళలేదుగా పాస్ చేయటానిక్కి.

కొత్త—అల్లాగా! నేను Bill Pass అయిందనుకున్నా లెండి. ఆ కాగితాలు మీ దగ్గరకొచ్చాయా ?

రఘు—వచ్చాయి. దానిసంగతి మీకెందుకూ ?

మామ—వారికి అక్కరలేనిది లేదుగా.

కొత్త—బాగ చెప్పారు. సరేలెండి వస్తా. ఆ సంగతి అడుగు దామనే వచ్చా. ఏంలేదూ, అతనుతొందరపడుతుంటేనూ.

మామ—అదేమిటి ? వెళ్తున్నారా !

కొత్త—ఆ వెళ్తా. దానికోసమే వచ్చా-వస్తా.

మామ—మావాడు మీకు చెప్పటానికి కొంచెం మొహ మాట పడ్తున్నట్లున్నాడు. కాని చూడండీ ఆ బిల్లుమీద ఏవో objectio ns -వున్నాయట. అందువల్ల......

కొత్త—అందువల్ల –?

మామ—బహుశా pass. అవదు.

కొత్త—అవదూ-సరేలెండి ఏంచేస్తాం-?

మామ—అదేమిటండీ!, ఇంతదూరం రికమెండ్ చేయటానికి వచ్చి "సరేలెండి" అని వెళ్ళిపోతారేం ?

కొత్త—అవుతుందో-లేదో-తెలిసిందిగా-చాలు...

మామ—మరి అతను తొందరపడ్తున్నాడన్నారూ ?

కొత్త—తొందరపడడూ మరి! అక్కడ కంట్రాక్టుపని జరగ కుండా డబ్బు కావాలాయె.

మామ—ఆ! ఆ!

కొత్త—వంతెనపని కాగితాలమీద జరిగిందికాని కాలవ మీద జరగలే; మరేంలేదు రఘునాధరావుగారూ. Bill

Pass చేస్తే మీరు అరెస్టయ్యేవారు. అంతే-వస్తా ...
.........(వెళతాడు)

(రఘు నిస్తబ్ధుడై నిలబడిపోతాడు)

రఘు—(గబగబా కాగితాలు తిరగవేస్తాడు)

మామ— ఏమిటంది ?

రఘు—work జరిగినట్లు-లేదు-యీ ఫైల్లో.

మామ—అరే-!

రఘు—లేదు-కొంపముసిగేదే, సంతకంపెట్టానుగాదు.

మామ—అయితే యీ నిజాయితీపరులందరూ అంతయిదిగా చెప్పి వెళ్ళారు.

రఘు—మోసం చేస్తున్నారు-మోసం! అందుకనే ఎవరికి వారు తప్పుకు వెళ్ళారన్నమాట.

మామ—ఆ!

రఘు—అవును. అంతే; లేకపోతే అందరికీ ఒక్కసారే సెలవు కావాల్సివచ్చిందా ?

మామ—అయితే నా అనుమానం నిజమేనన్నమాట!!

రఘు—నిజమే; ఆఫీసు బాధ్యతంతా నామీదే వదలి తాము తప్పుకోటానికి ఎత్తువేశారు-ఎత్తు-

మామ—సరే! ఇప్పుడేం చేస్తావ్ ?

రఘు—ఇహా చేసేదేముందీ; ఈ పెద్దమనుష్యులందరిపనీ పట్టిస్తాను. అబ్బా! ఎంత మోసం!

పాపా—(వస్తాడు) ఉన్నారా, మరేంలేదు, ఆ కంసులు తీసుకువచ్చిన సంచీ యిస్తారేమోనని..—వచ్చా.

రఘు—అదా! ఇస్తాం... —కౌసల్యా-కౌసల్యా!

(కౌసల్య లోపల్నించి 'ఆ' అంటుంది.)

రఘు—ఆ కందులసంచీ కావాలిట. యియ్యి

పాపా—ఆఫీసు టైమ్ అయినట్లుంది. ఇంకా భోజనానికి లేవ లేదేం సూరు?

రఘు—ఇదిగో!-ఏవో మాటల్లోవుండి.

పాపా—ఆహా! మామయ్యాగారు యీపూట వుంటారా?

మామ—ఆ! ఆ! వుంటా వుంటా.

(కౌసల్య కాళీసంచియిచ్చి వెళ్తుంది. పాపారావు సంచీలో చూసుకుని తెల్లబోయి వెళ్ళబోతాడు)

రఘు— ఆగండి (ఏదో అనుమానించి గట్టిగా అంటాడు)

పాపా—ఏం?

రఘు—పనుంది. (దగ్గర కెళ్ళి సంచీలో చూసి ఒక వుత్తరం బయటకు తీస్తాడు. పాపారావు మరీ తెల్లబోయి నిమ్మదిగా వెళ్లిపోతాడు)

రఘు(ఉత్తరం చదువుతూ నిలబడి పోతాడు.)

మామ—ఏమిట్రా! ఏదో ఉత్తరం లాగుంది.

రఘు—ఆ, ఉత్తరం; ఉత్తరమే! నాకు తెలియకుండా నా కళ్ళ ముందు-నా వెనకా-నా జేబులో కూడా-ప్రేమ ఉత్తరాలు, అబ్బ!...మామయ్యా...పిలు-దాన్ని. పీక పిసికేస్తాను.

మామ—తొందరగ పడకు,

రఘు—తొందరేం—ఇంకెందుకు. అనుమానం. ఇంకెందుకు ఆలస్యం! (లోపలికి వెళ్ళబోగా మామయ్య అడ్డు పడుతూ...)

మామ—రఘూ!

రఘు—ఒదులు నన్ను,

("రఘునాథరావుగారూ," అని బయట పిలుపు వినబడుతుంది)

రఘు—ఎవరది! నా జన్మ—నా ఖర్మ—నా గతి చూసి నవ్వటానికి వస్తున్నారా ప్రజలందరూ?

మామ—లేదురా; మీ కృపానిధి వస్తున్నాడు.

రఘు—ఎందుకూ నన్ను నిలువునా గోతిలో దించి—ఇంకా ఎందుకూ?

మామ—ఆగు కాస్త నిమ్మదిగా ఆలోచిద్దాం.

రఘు—ఇంకా ఏం ఆలోచన! రాసి! పిడిసంగతి తేల్చిన తర్వాతే......

[కృపానిధి వస్తాడు]

మామ—ఏం బాబూ మళ్ళీ వచ్చారు?

కృపా—ఏం లేదు. ఆ నారాయణరావు, ఒల్లూ.........

రఘు—ఆ నారాయణ బిల్లు [illegible] అయిందో లేదో కనుక్కోటానికా! నా ఇన్స్పెక్టర్ ఉద్యోగం [illegible] ఉందో లేదో తెలుసుకోటానికా? నా [illegible] నిలువునా [illegible]ప్పుకున్నానో లేదో చూసి పోటానికా?

కృపా—అబ్బే! అది కాదండి. ఇందాక objections వున్నాయన్నాను చూశారా? అవ్వి సరిగ్గా చూస్తానో చూడకుండా సంతకం పెడ్తానో నని చెప్పి పోవటానికి వచ్చాను. మీకు కృష్ణారావు సరిగ్గా చెప్పాడో—లేదో; ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగారు జతపరచలేదా.

మామ—అహా! కృష్ణారావు ఆ విషయం చెప్పలేదే.

కృపా—ఎందుకు చెప్తాడూ! ఆ కంట్రాక్టరు బాగా చెయ్యి తడిపి వుంటాడు.

రఘు—ఆ! వాడి చెయ్యి తడిసింది. Head Accountant గారి చెయ్యి తడిసింది. అందరూ కలిసి నా కొంప ముంచటానికి ప్రయత్నిస్తున్నారు. అందరూ సెలవు పెట్టి తప్పుకొని, నెత్తిమీదకు తేవాలని చూస్తున్నారు.

కృపా—ఛ. ఛ. లేదండీ! మా అమ్మాయికి జ్వరం వుందో లేదో కావాలంటే వచ్చి చూడండి.

రఘు—చూడ నక్కర లేదు. ఇహ దయచేసి వెళ్ళండి.

కృపా—(మామయ్యతో) వస్తానండీ (నెమ్మదిగా వెళతాడు)

రఘు—అబ్బ మనిషి కళ్ళు మూసుకుని నమ్మటం ఎంతపొరపాటు నా ప్రక్కనే నా యింట్లోనే పులివన్నె మేకంతో కాపురంచేస్తూ ఎన్ని సంవత్సరాలు గడిపాను. నీమాటే నిజంమామయ్యా! ఈ ప్రపంచంలో భగవంతుణ్ణి కూడా నమ్మటానికి వీల్లేదు. ఛ—ఛ—ఛ.

మామ—రఘూ!

రఘు—కాదు ఊరుకోటానికి వీల్లేదు దీనిసంగతీ, నాసంగతీ, యివ్వాళ తేలిపోవాలి. నువ్వేళ్ళు పోనున్నావా! కాసే పుండిరా. ఈ లోపల దీనిరక్తం కళ్ళచూస్తాను.

(లోపలకు వెళ్ళబోగా)

మామ—రఘూ!

రఘు—నన్నాపకు.

మామ—ఆగు మీ Head Accountant వస్తున్నాడు.

రఘు—హెడ్ అకౌంటెంట్! ముసలినక్క! రాస్కేల్; ఏ మొహంపెట్టుకుని మాట్లాడుతాడో!

వెంక—(వస్తాడు) ఉన్నావా! రఘునాధరావు.

రఘు—ఏం వచ్చారు? మీ వాళ్ళ యింట్లో ఆబ్దీకంగా.

వెంక—ఆ-ఆబ్దీకంవుంది. భోజనానికి వెళ్ళాలి. ఇంకా చాలా ఆలస్యం వుందిలే. ఆ మాటౌన్! ఇందాక బిల్లుసంగతి చెప్పానే......

రఘు—ఆ చెప్పారు-ఇంకేం చెప్పాలి. అది Pass చేయమన్నారుగా... Pass చేయించి నా కొంపకు నిప్పుముట్టిద్దామనుకున్నారుగా.

వెంక—ఆ! ఆ! Pass చేస్తే అంతపనీ అయ్యేదే. కృపానిధి చెప్పాడు.

రఘు—కృపానిధి చెప్పాడా! నారాయణరావ్ లంచం మప్పాడా?

వెంక—అబ్బే! కృపానిధే చెప్పాడు-దానిమీద Objections మామూలివి కాదట-అసలు వాడు పనేచేయలేదట.

మామ—అది తెలిసిందిలెండి. ఏడూ Pass చేసే వాడు కాదు.

వెంక—ఆ! అది చెప్పటానికే వచ్చా. వాడేదో యిస్తాడని కక్కుర్తిపడితే కొంపమునుగుతుందిగా! సరిగా చెప్పిపోదామని వచ్చా—వస్తా—రఘునాధరావు. (వెళ్తాడు)

రఘు—చెప్పిపోదామని వచ్చాడు— నాకంఠం నేను నులిమి వేసుకుంటుంటే చూసిపోదామని వచ్చాడు. పరిస్థితులన్నీ చక్కగా చక్కబరుస్తాలే. ముందు దీనిగొంతు నొక్కిపారేస్తేగాని. (గబగబా లోపలికి వెళ్ళబోతాడు) "రఘూ—రఘూ" అంటూ మామయ్య వెంటవెళ్ళి ఆపబోతాడు. రఘు దులుపుకుని వెళ్ళిపోతాడు. ఏం చేయటానికి తోచక మామయ్య ఆగిపోతాడు)

(లోపల్నించి రఘు కౌసల్యల మాటలు వినిపిస్తాయి)

రఘు—ఏమిటిది? ఈ ఉత్తరం ఎవరువ్రాశారు?

కౌస—నేను వ్రాసిందికాదే.

రఘు—కాదని దబాయిస్తే సరిపోతుందనుకున్నావా! నా కళ్ళయెదట ఉత్తరాలు పంపిస్తూ నా జేబులోనే ఉత్తరాలు దాచిపెడ్తూ యింకా దబాయింపే?

కౌస—నేను వ్రాసింది కాదంటే వినరేం!

రఘు—నువ్వు వ్రాసింది కాదంటే సరిపోతుందా? మరి ఆ సంచిలో కెట్లా వస్తుంది. చెప్పవేం? దవడ పేలగొట్టేవాడు లేక.

(ఇది లోపల్నించి వినిపిస్తుండగా పాపారావు గారింటి మీందనుంగబగ వావస్తాడు. మామయ్యతో మాట్లాడుతుండగానే లోపల యీ క్రింది సంభాషణ జరుగుతూ వుంటుంది)

కౌస—కొడతాడు - ఎందుకొట్టడతారూ? నేనది వ్రాయ - లేపోతే వినరేం—

రఘు—మళ్ళీ అదేమాటా నువ్వు వ్రాయకపోతే సంచీలో కెట్లా వస్తుంది ?

కౌస—ఎట్లా వచ్చిందో ఆ పాపారావునే అడగండి. నన్నడగుతారేం ?

రఘు—అడుగుతాను. ఎందుకడగనూ-అడిగి తేల్చుకోందే వదిలిపెడ్తానా, రా అడుగుతాను.

పాపా—ఏమిటండీ ? ఏమిటా కేకలు?

మామ—ఏమిటా! ఛీ! నిన్నేమంటే ఏం పాపం ?

పాపా—కాదండీ నామాట వినండీ. ఆయన్ని పిలవండి ముందు; పెద్దవాళ్ళు మీరుండి గూడా.........

మామ—పెద్దవాణ్ణి. ఏ మొహంతో వాడికి అడ్డం వెళ్ళను ? ఏ మాటలతో వాణ్ణి ఊరుకో పెట్టనూ? ఆ వుత్తరం వ్రాసింది నువ్వేగా! ఇంకా ఏ మొహంతో—

పాపా—అది రాసింది నేనుగాదండీ. ఆ ఉత్తరం వీరికి కాదు.

మామ—పన్నాగం ఏదో దొరికి నట్లుందే.

పాపా—కాదండీ. పన్నాగం కాదు. నామాట వినండి. అది వీరికి కాదు. ఆ సంచిలో కనుపించేటప్పటికి నా... వణుకు పుట్టింది. ప్రమాణ పూర్తిగా చెప్తున్నాను.

[ఆఖరి మాటను అంటూ రఘు గబగబా కౌసల్య పు లాక్కొని వస్తాడు]

మామ—రఘూ ఆగరా (పాపారావుతో) వీరికి కాకపోతే ఆ సంచీలోకి ఎట్లావచ్చింది ?

పాపా—సంచీ, కందులూ కూడా మాకు మరొకరు యిచ్చారు. దాంట్లో వుత్తరం వుందని తెలియక మీకు తెచ్చి యిచ్చాను.

రఘు—అయితే యింతకూ...

పాపా—నన్ను క్షమించండి; దురదృష్టం వల్ల యిదంతా జరిగింది. అనవసరంగా మీకు కష్టం కలిగించాను.

మామ—అయినా నీకిదేం పాడు బుద్ధయ్యా? ఇంకా చిన్న కుర్రాడివా?

పాపా—అందుకే లెంపలు వేసుకుంటున్నాను.

రఘు— లెంపలు వేసుకోవటంతో అయిపోదు. మరి యీ వుత్తరం ఎవరు వ్రాశారూ. ఎవరిని నా జేబులో పెట్టారు?

పాపా—ఏం ఉత్తరం?

రఘు—ఇదిగో-(జేబులోంచి ఉత్తరం తీస్తాడు)

పాపా—(చదివి) దీని సంగతి నాకేం తెలియదే! నాకు తెలియదు.

మామ—మీరే వ్రాసివుంటే చెప్పండి! ఎందుకొచ్చిన గొడవ.

పాపా—రామ! రామ! నే నెంత బాధపడ్తున్నానో మీకు తెలియదు-కాని...కాని-ఇది నేను వ్రాయలే.

రఘు—సరే. ఇహ మీరు వెళ్ళండి. (పాపారావు వెళ్తాడు) (కౌసల్యతో) ఊఁ. దీని సంగతేం చెప్తావ్.

కౌస—నేనేం చెప్పను.

రఘు—చెప్పకపోతే ఊరికే పోదు.

కౌస—మీకు చేతనయింది చేసుకోండి-ఇల్లా తిడతారు, కొడతారూ; ఇంట్లోంచి గెంటేస్తారు - అంతేగా?

కానివ్వండి... కానివ్వండి... అన్నింటికీ నేను సిద్ధంగానే వున్నా.

రఘు—ఓ ? అంతవరకూ తెగించావ్.

కౌస—ఆ! మీ అనుమానాలన్నీ నివర్తించటానికి బాధ పడాల్సిన అవసరం నా కేం లేదు. మీ జేబులో ఉత్తరానికి నన్ననుమానిస్తున్నారిప్పుడు. మీ జేబులో ఉత్తరానికి అనుమానించాల్సింది అసలు మిమ్మల్ని. నన్ను కాదు.

రఘు—నన్నా ! న న్ననుమానించట మేమిటి ?

కౌస—ఆ! మీమీదే నా అనుమానం. ఆ ఉత్తరం మీ జేబులో నిన్నట్నించీ వుంది. నిన్నట్నించీ దాన్ని చూసి నే ననుమానిస్తున్నాను. అనుమానంతో కుమిలి అడుగ లేక ఆగిపోతున్నాను. ఇప్పుడు అడుగుతున్నాను. ఎవరిదో ఉత్తరం—ఎవరిదో నస్తారి – ఏ సంతకం చేని ఉత్తరానికి న న్ననుమానించారు–ఇప్పుడు మిమ్మల్ని నేననుమానిస్తున్నాను. నామీద అనుమానం నే నే తీర్చాలన్నారుగా! మీమీద అనుమానం మీరే తీర్చండి. చూస్తాను.

మామ—అవున్నా! దానిమాట నిజమే!

రఘు—ఏమిటో! ఇదంతా ఏం అర్థంకావటం లే !

కౌస—అర్థమెందుకవుతుంది? ఆడదాన్ని కాబట్టి ఎంతమాట బడితే అంతమాటన్నారు... చేతనవును కాబట్టి చెయ్యి చేసుకుంటున్నారు. చేత కాని ఆడదాన్ని కనక మెదలకుండా పడివుండాలి. (కోపంగా వెళ్ళిపోతుంది)

(కృష్ణారావు బయట నుంచి "రఘునాథ రావూ, రఘు నాథ రావూ అని కేక వేస్తాడు.)

రఘు—ఆ! అవునః రాసి! అబ్జక్షన్సు సంగతి చెప్పకుండా Bill Pass చేయించాలని చూశాను. సంగతి తేలుస్తాం-టెన్నవాడు.

మామ—పైగా ఊరెళ్తానన్నాడు.

[కృష్ణారావు నిమ్మదిగా వస్తాడు.]

రఘు—రండి. ఊరెళ్తానన్నారుగా! వెళ్ళలేదే...!

కృష్ణ—వెళ్ళలేదండీ: ప్రయాణం ఆగిపోయింది.

రఘు—ఆగిపోయిందీ! నాకు తెలుసు, ఆగిపోతుంది. దొంగ ప్రయాణం ఆగిపోకేంచేస్తుంది?

కృష్ణ—మీరు నన్ను క్షమించాలి.

రఘు—ఎందుకు క్షమించాలి?

కృష్ణ—నే నిందాక అబద్ధం చెప్పాను.

మామ—అబద్ధమా! ఎందుకు చెప్పారు?

రఘు—ఎందుకేముంది? ఊరుకువెళ్తానని సెలవుపెడితే Bill Pass చేసిన తప్పు నామీద పడ్తుంది. పోతే నేను పోతాను.

కృష్ణ—మీరు పోవటమేమిటి?

రఘు—అంతేగా! ఆ Bill కు అబ్జక్షన్సు వున్నాయిగా-కళ్ళు మూసుకు సంతకం పెడతాను. ఇరుక్కుంటే యిరుక్కుంటాను అనుకున్నారు.

కృష్ణ—ఛ-ఛ-మీరు కళ్ళుమూసుకు సంతకం పెట్టారా - ఎప్పుడన్నా మీసంగతి! నాకు తెలియదూ! అబ్జక్షన్సు సంగతి మీకు తెలుసు. తెల్సే Pass చేస్తున్నారనుకున్నా.

రఘు—తెల్సే Pass చేయటమేమిటి? తెలిస్తే ఎందుకు Pass-చేస్తాను.

కృష్ణ—ఆ! మిమ్మల్ని నారాయణ కలుసుకున్నాట్టగా?
రఘు—నన్నా!!
కృష్ణ—ఆ—వార్ని కల్సుకున్నాను. వచ్చించాను. వచ్చారని న్నారూ. పని చేస్తానన్నారూ—అన్నాడు.
రఘు—ఎప్పుడూ? లేదే!
కృష్ణా—ఏమో! అల్లాగంటే—"సరే కాబోలు"ననుకున్నాను.
రఘు—అంతేనా! లంచం గూడా యిచ్చానన్నాడా!
కృష్ణా—నిజం, చెపున్నాను; రెండొందలు యిచ్చానని చెప్పాడు. సరే; నే నష్టంపడి దేఆష్టం పడ్డా—ననుకోండి—కాదు— సెలవు పెట్టి పోదాం. అనుకున్నా నేనేదో—గడితిన్నానుు. ఆకృపానిధి అనుకున్నాట్టు. ఆసంగతి నా కిప్పుడే తెలిసి. మీతో చెపుదామని వచ్చాను
మామ—అదా సంగతి!
రఘు—ఓరి నాయనా; ఇంత ఘోరమా! కానీ ఈ నారాయణ రావు నాటకానికి కావల్సినంతా అనుభవిస్తాడు.
కృష్ణా—చిత్తం—ఆఫీసు Time అవుతోంది. వెళ్ళొస్తా
రఘు—ఆ—వెళ్ళండి.
కృష్ణా—కానీ...(ఏదో అనుమానిస్తూ నిలిచిపోగా,
మామ—కానీ ఏమిటి! ఇంకా అనుమానిస్తున్నారు?
కృష్ణా—ఏం లేదు; నిన్న పొరపాటున... నా ఉత్తరం ఒకటి మీరు తీసి మీ జేబులో పెట్టుకున్నారు.
రఘు—మీ ఉత్తరమా!
కృష్ణా—ఆ—నాదే! నిన్న నా టేబుల్ మీదనించి తీసి జేబులో పెట్టుకున్నారు......
రఘు—అదా! (నవ్వి) ఏదో ప్రేమ ఉత్తరంలాగ...

కృష్ణా—ఆ-అదేనండి, ఆఫీసుకి రాయొద్దంటే వినకుండా మా ఆవిడే వ్రాసింది. పొరపాటున అది టేబుల్ మీద వుంచాను. మీరు తీసి జేబులో పెట్టుకున్నారు.

రఘు—(నవ్వి) ఇందండీ.

మామ—ఓరి. ఏం పని చేశావయ్యా—నీ కడుపు బంగారం గానూ! అప్పుడే అడిగి తీసుకోకపోయావ్?

కృష్ణా—అడగాలని సన్నట్నించీ ప్రయత్నిస్తున్నాను. కాని ఎల్లా అడగటం. ఎప్పుడు చూశినా ఎవరో ఒకరితో ఎప్పుడూ వుంటున్నారు. వస్తానండీ వస్తా. (వెళతాడు)

రఘు—అనవసరంగా దాన్ని కేకలేశాను; చూశావా? నువ్వు చెప్పినట్లు అనుమానిస్తే ఏమయిందో.

మామ—చూశా,...కాని అనుమానించినా, అంతగట్టిగా అనుమానించకూడదు రా.

రఘు—బాగానే వుంది. ఇప్పుడు దాన్ని గంటసేపు బ్రతిమాలాలి—చేసిన నేరానికి.

మామ—అందుకే అంటున్నా. అంత యిదిగా అనుమానించ కూడదు...వెళ్ళిరా...ఆగావేం?

రఘు—కాని—కాని...ఇప్పుడే తిట్టి—యిప్పుడే ఎట్లా బ్రతిమాలను?

మామ—పోయిరా; తప్పేముంది? నే నిక్కడే కూర్చుంటా.

రఘు—వస్తా.

మామ—ఆ—ఆ—నిమ్మదిగా నేరా!

(రఘు వెళ్తాడు, మామయ్య పేపరు తీసుకు కూర్చుంటాడు)

( తెర )

---

# పిలవని పరదేశి

(గాంధిజీ సౌత్ ఆఫ్రికా జీవితంలోని ఒక ఘట్టం)

ఏకాంకిక

## పాత్రలు :

1 మహాత్మాగాంధీ.

2 అలెగ్జాండర్ : మున్సిపల్ పోలీస్ సూపరింటెండెంట్.

3 భార్య : అలెగ్జాండర్ భార్య.

4 ఎలిన్ : అలెగ్జాండర్ కూతురు.

5 ఎస్కాంబీ : కేబినెట్ మంత్రి.

6 లాఫ్టన్ : గాంధీజీ స్నేహితుడు - లాయరు.

7 టాటం : హార్బర్ సూపరింటెండెంటు.

8 సామీ : అలెగ్జాండర్ యింట్లో సేవకుడు - తమిళ దేశస్థుడు.

9 1వ డిటెక్టివ్.

10 2వ డిటెక్టివ్.

11 1వ పత్రికా విలేఖరి.

12 2వ పత్రికా విలేఖరి

సమయము : జనవరి 1397.

ప్రదేశము : నేటాల్‌లోని దర్బాన్ రేవుపట్టణములో.

పిలవని పరదేశి :—

గాంధీజీ సౌత్ ఆఫ్రికాజీవితాన్ని నాటకంగా ఇంగ్లీషులో వ్రాయటాలని ప్రారంభించాను. ఆప్రయత్నం యింకా కొనసాగలేదు. ఈలోపున యిదొక ఏకాంకికగా ప్రదర్శించటానికి బాగావుందనే ఉద్దేశ్యంతో తెలుగుచేసి ఈపేరున ప్రచురిస్తున్నాను. మనం కళ్ళారాచూసి – ప్రతిక్షణంగుర్తుకు తెచ్చుకోగలిగిన మహాపురుషుణ్ని రంగస్థలంమీదకు ఎంత make up తో తెచ్చినా సంతృప్తి వుండదు. అయితే ఆబాధ యీనాటికలో లేదు. నాటికలో మొదటిసారి వచ్చినప్పుడు కూడా గాంధీజీకి ఆవయసులో మీసాలు దొరటోపీ వుండేవి. మనం కళ్ళల్లో ఆడుతున్న అవతారమూర్తి ఆవయస్సులో లేదు. రెండోసారి వచ్చేటప్పుడు గాంధీజీ నూరువేషంలో వస్తాడు. కనక make up బాధ దీసుకోలేదు.

ఇంగ్లీషులో రంగప్రారంభంలో ఎలిస్ బైబిల్ చదువుతుంది. తెలుగులో బైబిల్ చదవటానికి "చదువుతున్నది బైబిల్" అని చాలామందికి తెలియకుండా పోతుందని భయపడి, దాన్ని క్రీస్తును శిలువవేసే కథగామార్చాను.

ఈనాటికలోకూడా ప్రదర్శించటానికి set కావాలి. అధమం glass doors వున్న కిటికీలన్నా కావాలి. గ్లాస్ తలుపుల్లాంటి రోడ్డుమీద జరుగుతున్న "మేలా" కనిపించకపోయినా ఆమాత్రం set అవసరం అయితే ఔత్సాహిక నట

సమాజాలు ఆమాత్రం set మీద శ్రద్ధ తీసుకొంటూనే వున్నారు.

దీన్లో గాంధీజీ ఆత్మకథ మొదలైనవాటిల్లో వుందినంత వరకూ చరిత్రంతా తీసుకున్నాను. ఎలిస్-సామీ పాత్రలు నాకల్పితాలు. ఇంగ్లీషులో వ్రాసినప్పుడు సాధ్యమయినంత వరకూగాంధిజీ ఆత్మకథలోవున్న సంభాషణలే వాడాను.

గాంధీజీ సౌత్ ఆఫ్రికా జీవితం మూడురంగాల్లో వ్రాయాలని ప్రయత్నం. ఇదికాక మరో రంగంకూడా పూర్తవుతున్నది. తర్వాత భగవదానుగ్రహం.

గంగాధరరావు.

# పిలవని పరదేశి

[1897 జనవరి నెలలో ఒక ఉదయం Mr అలెగ్జాండర్ మునిసిపల్ పోలీసుసూపరింటెండెంట్ గారి యింట్లో సుమారు 8 గం॥ వేళ అలెగ్జాండరు భార్య సోఫామీదకూర్చునివుంది. ఆమెకు షుమారు 30 ఏళ్ళుంటాయి. ఆమె ప్రక్కనే 10 ఏళ్ళ కూతురు కూర్చుని బైబిల్ కథలు చదువుతున్నది. గదికొక ప్రక్క గ్లాస్ పేన్లుగల పెద్ద కిటికీవుంది. ఆ కిటికీలోంచి రోడ్డూ. రోడ్డుమీద తిరుగుతూ ప్రజలూ కనిపిస్తుంటారు. అటువైపే బయటకుపోయే దర్వాజాకూడావుంది. రెండవ వైపు లోపలకుపోయే దర్వాజాలున్నాయి.

(తెర ఎత్తేసరికి కూతురు ఎలీస్ గట్టిగా బైబిల్ కథ క్రీస్తును శిలువవేసిన ఘట్టం చదువుతున్నది:—)

ఎలిస్—కనక పైలేట్ జీసస్‌ను వదిలెయ్యాదల్చుకుని — మళ్ళా ఒకసారి ప్రజలనడిగినాడు. కాని ప్రజలందరూ "శిలువ వేయాల్సిందే" నని గట్టిగా మళ్ళీ అరిచినారు.

"ఎందుకు? ఎందుకని యితణ్ణి శిలువ వెయ్యాలి? శిలువవెయ్యటానికి ఇతనేం తప్పుచేశాడు? అంత పెద్దశిక్ష వెయ్యాల్సిన నేరమితనేమీ చెయ్యలేదు. అందువల్ల యితణ్ణి నేను వదిలివేస్తాను." అని మూడోసారి పైలెట్ అన్నాడు.

కాని వాళ్ళందరూ "శిలువ వెయ్యాల్సిందే; శిలువ వెయ్యాల్సిందే" నంటూ బిగ్గరగా అరిచారు. వారిమాటే—

మతగురువులమాటే–చివరకు నెగ్గింది. వారి కోరిక ప్రకారం జీసస్‌ను శిలువ వేయమని పైలెట్ శిక్ష విధించాడు.

అప్పుడు జీససును ఊరిబయటకు తీసుకుని వెళ్లారు జీససు వెంట చాలామంది స్త్రీపురుషులు వెళ్ళారు. స్త్రీలు ఎంతో దుఃఖిస్తూ నడిచారు.

అప్పుడు జీసను "సోదరీమణులారా నాకోసం మీరు దుఃఖించవద్దు–మీకోసమే–మీపిల్లలకోసమే – మీరు దుఃఖించండి. ఎందుకంటే — — వంధ్యస్త్రీలే అదృష్టవంతులని భావించే రోజులు రాబోతున్నాయి." అని వారిని ఓదార్చాడు.

జీసను వెంట మరో ఇద్దరు బందిపోట్లను కూడా శిక్షించుట కొరకు తీసుకుని వెళ్లారు. ఊరిబయట కెవల్రీ అనే ప్రదేశమున–చివర శిలువపాతి–జీససును — అతని రెండు ప్రక్కలా, ఆ ఇద్దరు బందిపోట్లను శిలువమీద మేకులతో కొట్టినారు.

అప్పుడు జీసను "ఓ తండ్రీ! వీరందరినీ క్షమించు. వారేం చేస్తున్నారో వారికే తెలియదు." అని ప్రార్థించాడు. ప్రజలు జీసను వస్త్రాల్ని తీసుకుని తలావొకటి పంచుకున్నారు. ప్రజలూ, పరివారకులూ, సైనికులూ, అందరూ చుట్టూరా చేరినారు. "ఇతడే క్రీస్తుపుత్రుడైతే ప్రజలను రక్షించే ముందు తనను తానే రక్షించుకోవాలి." అంటూ ఆక్షేపించినారు.

సారాయి త్రాగమంటూ – సైనికులందరూ అతని మీద సారాయినిపోసి అపహాస్యంచేశారు. "నువ్వే జ్యూలం

వరికీ రాజునయితే నిన్ను నీవు రక్షించుకోమంటూ ఎగబడి నవ్వినారు, ముళ్ళతో చేసిన కిరీటాన్ని తయారుచేసి ఆతని తలపైన పెట్టినారు. ఆశిలువక్రింద గ్రీకులాటిను, హిబ్రూ అక్షరాలలో "ఈతడు జ్యూలకందరకూ రాజు" అని లిఖించినారు.

(ఎలిస్ ఆగి...ఏదో ఆలోచించి గద్గదకంఠంతో)

ఎలిస్—అమ్మా క్రీస్తును శిలువవేశారు; సరే. ఆయనమీద ఉమ్మివేసి తిట్టి అవమానించటం ఎందుకే...?

భార్య—వాళ్ళకేం తెలియదు, ఏమీ తెలియని వాళ్ళ పద్దతే అది.

ఎలిస్—(తిరిగి చదువుతూ) నువ్వే జ్యూలందరికీ రాజువైతే నిన్ను నువ్వు రక్షించుకోమంటూ అరిచారు. శిలువక్రింద గ్రీకుఅక్షరాలలో ఇతడే జ్యూలందరికీరాజు. అని వ్రాశారు. (చదువు ఆపి) అమ్మా. నువ్వు జీసస్ క్రైస్తునుచూశావా ? ఎప్పుడన్నా.

భార్య—నేనా ? ఎట్లా! ఆయన తిరిగి తీర్పునోజుదాకా కనుపించరు.

ఎలిస్—ఆరోజుదాకా మన కనుపించేవారందరూ హీరోడ్ లు పైలేట్లు.

భార్య—పిచ్చిప్రశ్నలు వెయ్యకు-ఎలిస్! ఈసంగతులన్నీ పెద్దదానవై తేగాని నీకు తెలియవు.

ఎలిస్—(చదువుతూ)

ఒకడు—(ఒకడు పక్కనున్న నిందితుల్లో) "నువ్వు క్రీస్తు వయితే నిన్ను నీవు రక్షించుకో. మమ్మల్ని" రక్షించు (అని ఏడ్చాడు)...........

రెండవ—(రెండవ నిందితు డందుకొని) "ఇతడుగూడా మనకు మల్లేనే నిందితుడగుటజూచి, దైవభయం నీకున్నూడా పోయిందా! మనం మన పాప ఫలితాన్ని అనుభవిస్తున్నాం. కాని ఈత నేంచేశాడు! ఈత నే పాపం చేయ లేదే!

ఎలిస—(చదువాపి ఏడుస్తూ) అవును, అత నే పాపం చేయ లేదు—ఏపాపం చేయలేదమ్మా. ఏపాపం చేయలేదు.

(ఎలిస్ కళ్ళనీళ్ళుపెట్టుకోవటం అలెగ్జాండర్ భార్యచూసి)

భార్య—ఏమిటది-ఎలిస్!

ఎలిస్—అవునమ్మా-జీసస్ ఏంపాపం చేయలేదు.

భార్య—పిచ్చిపిల్లా-ఇవ్వాల్టికిక చదవకు. ఇట్లారా; ఇక చదవద్దులే.

(అంతలో అలెగ్జాండర్ వస్తాడు, ౪౫ ఏళ్ళవాడు — రావటంలోనే తిరిగి మళ్ళీ వెళ్ళాలన్నట్లు-తొందరపడ్తున్నాడు)

భార్య—మళ్ళా వెళ్ళాలా ఏమిటి?

అలె—ఆ, వెళ్ళాలి.

భార్య —చాలా తొందరపని తగిలినట్లుందే!

అలె—ఆ-ఆ- పోలీసుఆఫీసర్ కి తగిలేవన్నీ తొందరపనులే-చివ్వరికి అన్నంగూడా తొందరగా తినాల్సిందే. గుడ్డలు గూడా తొందరగా వేసుకోవాల్సిందే. పనిదగూడా తొందరగా పోవాల్సిందే.

భార్య—పదేళ్ళ అనుభవం! అదంతా నాకింకా చెప్పాలా ఏమిటి! కాని ఇవ్వాళ వచ్చిన పనేమిటి? ఇంతపొద్దున్నే పరుగెత్తవల్సినంత ఏం మునిగింది—ప్రార్థనకన్నా—డా ఉంచ కుండా?

అలె—ఆ! స్త్రీప్రార్థనలకే ముచ్చెలే. ప్రార్థన ఎప్పుడన్నా చేయవచ్చు. అందుకోసం duty ఆగుతుందా?

భార్య—ఇవ్వాళ్ళున్నా కొత్తడ్యూటీ పడిందా?

అలె—ఆ! సరికొత్త duty దర్బాన్ హార్బర్లో అల్లరు జరగకుండా నివారించాలని గవర్నమెంటువారు ఆజ్ఞాపించారు. పోర్టులాండ్ ఓడలోంచి మీసాలున్న మగవాడొకడు హార్బర్లో యివ్వాళ దిగుతాట్ట.

భార్య—ఓహో! అయితే ఆ హిందూదేశస్థుడు దేశంలోకి రావచ్చుని ఆర్డర్లు పడ్డాయన్నమాట.

అలె—ఆ-ఈ అనాహ్వానితుడు దిగంగానే అపూర్వమైన ఆహ్వానం జరుగుతుందని మాకు తెలుసు.

[సామి అనే నౌకరు వస్తాడు]

సామి—లాప్టన్ గారూ, టాటంగారూ వచ్చారండీ. వచ్చి మీకోసం వరాండాలో కూర్చుని వున్నారు.

అలె—లోపలికి తీసుకురా.

సామి—అల్లాగే సార్. (వెళతాడు)

భార్య—లాప్టన్ ఎవరూ?

అలె—ఆయన ఒక ప్లీడరు; నాటాలు ప్రభుత్వానికి సలహాదారు.

భార్య—"దాదా అబ్దుల్లా కంపెనీ" యీ ఆ పెద్దకంపెనీ-అదో ఇండియన్‌ది కాదూ?

అతె... ఆ! ఆ-అదే.

[లాస్టన్-టూటం వస్తారు]

ఇద్దరూ—Good Morning (భార్యతో) వీరే Mr. లాస్టన్ వీరు Mr. టూటం నీకు తెలుసుగా- పోర్టులో సూపరింటెండెంట్.

టూటం—ఆ, పోర్టు సూపరింటెండెంట్! ఎప్పుడూ లేని అల్లరీ. నేను లాస్టన్ గార్ని పరిచయం చేద్దామని వచ్చాను. వారు మీకిదివరకే తెలుసునల్లేవుంది. మీరిద్దరూ సంప్రదించుకొని నాపీడ నల్లాగన్నా విరగడ చెయ్యండి

భార్య—అల్లా అంటారేం? ఇప్పుడేం యిబ్బంది వచ్చింది ?

టూటం—మీకు తెలియదూ యింకా; అదే! ఆ దేగా దోవ వాళ్ళందరికీ. ఈదోవనే రోజూవస్తారు. వచ్చినానారకాల ప్రశ్నలతో నన్ను రోజూ వేధిస్తారు.

భార్య—ఎవరు వాళ్ళు?

టూటం—జనం-నల్లవాళ్ళూ, తెల్లవాళ్ళూ కూడా! నల్ల వాళ్ళు ఆయనకు సహాయం చేయాలనీ- తెల్లవాళ్ళు చావ గొట్టాలనీ. అలెగ్జాండర్-మీరు కల్పించుకుంటే నా బాధ్యత తీరిపోతుంది. అక్కడ శాంతి భద్రతలు బాధ్యత మీది.

ఆమె—నా బాధ్యత నిర్వహించటానికి నేనేం వెనక్కి తియ్యను రాత్రిపూట చీకట్లో గాంధీని వూళ్ళోకి పోవటానికి ఏర్పాటు చేయించమని నాకు పైనుంచి ఆర్డర్లు వచ్చాయి.

టాటం — నేనా ఉపాయం ముందే చెప్పాను. ఆ గాంధీ కూడా అల్లాగేనన్నాడు. ఎటొచ్చీ ఈ లాఫ్టన్ గారే కాదం టున్నారు.

అలె — అరే! ప్రజలెంత కోపావేశంతో వున్నారో లాఫ్టన్ గారికి తెలియదా?

లాఫ్టన్ — తెలుసు. కాని అల్లా చీకటి ముసుగులో తప్పించుకు బయట పడటం పిరికితనం గదా!

అలె — అది పిరికితనమయితే ఇల్లా పట్టపగలు ఓడ దిగి ప్రజల కళ్లపడటం ఉత్త మొండితనం—ప్రజల కళ్ళబడితే, రైటింగ్ జరగవచ్చు. ఖూనీలు కూడా జరగవచ్చు.

లాఫ్టన్ — జరిగినా సరే; దొంగలాగా చీకట్లో తప్పించుకు పోవటం పిరికితనమే.

అలె — బాగానే వుంది. మీ మాటలకే మెచ్చె! ఇలాంటి అల్లరి మీ నెత్తిమీదకు వచ్చినప్పుడు మీరల్లాగే చేయండి. కాని ఈ నల్లకూలీల నాయకుడు......

లాఫ్టన్ — ఆయన "బారెట్ లా" pass అయినవాడు.

అలె — ఏమయితే నాకేం! ఆయన నెత్తిమీదకూ ఆయన భార్యా పిల్లల నెత్తిమీదకూడా యిప్పుడు ముంచుకు వచ్చింది.

లాఫ్టన్ — కనకే నే నాయన్తో చెప్పాను. ముందు ఆయన భార్యా పిల్లల్ని కారులో రుస్తుంజీ యింటికి పంపివేసి—తర్వాత గాంధీ నేనూ నడచి బయలుదేరదామన్నాను.

అలె—సరి—ఆయ నేమన్నాడు ?

లాష్టర్—'సరే'' నన్నాడు.

అలె—ఏమన్నాడూ ?

లాష్టర్—''సరే'' నన్నాడు. ఏం జరిగినా సరే. నాతో నడచి రానటానికి ఒప్పుకున్నాడు.

భార్య—ఒప్పుకున్నాడా ?

టాటం—ఆ! ఒప్పుకున్నాడు. ఓడ కెప్టెన్ వచ్చి ప్రజలు కొట్టేటట్లుగా వున్నారని చెప్పినప్పుడు గూడా అమాటే అన్నాడు. కొట్టినాసరే తన అహింసా తత్వాన్ని వదలట్ట! కొట్టినవాళ్ల మీద కేసు గూడా పెట్టట్ట.

అలె—అయితే సరే! దెబ్బలు తినమనండి. బాధపడమనండి. మన కేం ? కాని ఒక్క సంగతి. మా పోలీసు విధిప్రకారం ముందుగానే సంగతి సందర్భాలన్నీ చెప్పాం. ఇక ఆయన కాళ్ళూ చేతులూ విరిగితే మా బాధ్యత లేదు.

లాష్టర్—Thank you Mr. గాంధీకి సౌత్ ఆఫ్రికా సంగ తంతా బాగానే తెల్సు. Mr టాటం! పోదాం-పదండి; గాంధీ పెళ్ళాం బిడ్డల్ని చేరవేయటానికి మోటార్ కారు సిద్ధంగానే వుంది. ఆయన్నతో నడిచి రావటానికి నేనూ సిద్ధంగానే వున్నాను.

అలె—నేను సిద్ధంగానే వున్నాను-తమాషా చూట్టానికి.

టాటం—ఏమిటో! హార్బర్ నుంచి ఆయన బయటపడి వెళ్లిపోతే ఎట్లాగో అట్లా-నా భాధ్యత [illegible]పోతుంది. వస్తామండి.

భార్య—మంచిదండి. (అలెగ్జాండర్ భార్యతో చెప్పి బయటకు నడుస్తారు)

ఎలిస్—ఎవరమ్మా ఆయన-ఎవరొస్తున్నారు ?

భార్య—గాంధీ అని ఇండియానుంచి వస్తున్నాట్ట.

ఎలిస్—ఎందుకొస్తున్నాడమ్మా-నాన్నగారి కిష్టంలేకుండా ?

భార్య—ఇక్కడెవ్వరికీ యిష్టంలేకుండానే వస్తున్నాట్ట. నాకూ శాగా తెలియదంతా.

సామి—నాకు తెలుసమ్మా! ఆయన యిక్కడ వుండే. యిక్కడ మా దేశంవాళ్ళకోసం పాటుపడినవాడే.

ఎలిస్—మీ దేశం వాళ్ళకోసం పాటుపడటమా? అసలు ఒకరికోసం ఒకరు పాటు బడటం యెందుకమ్మా ?

భార్య—అంతే! సరిగ్గా న్యాయం జరగనప్పుడు యిటువంటి వాళ్ళు పూనుకుని గవర్నమెంటుతో దెబ్బలాడుతారు.

ఎలిస్—గవర్నమెంటు న్యాయం ఎందుకు చెయ్యదూ ?

భార్య—ఒక్కొక్కప్పుడు కొంతమందికి న్యాయం జరగదు.

సామి—ఒక్కొక్కప్పుడేం ఖర్మ? మాకెప్పుడూ న్యాయం జరగటంలేదు.

ఎలిస్—న్యాయం జరగనప్పుడు మీరీ దేశం ఎందుకు వచ్చారయితే.

సామి—మా అంతట మేం రాలేదు. మా నాన్న చెప్పేవాడు, ఈ గవర్నమెంటువారు పొలాల్లో పనిచేయటానికి-మావాళ్ళని రమ్మని-అదీ-యిదీ ఆశపెట్టి పిల్చారట.

వాళ్ళందరూ ఏదో బాపుకుందామని యిక్కడకొచ్చారు మేమందరం యిక్కడ బానిసలుగా తయారయ్యాం.

ఎలిస్—నువ్వూ యిండియావాడివేనా సామి.

సామి—ఆ! ఇండియావాణ్ణే; ఇండియానించి వచ్చిన కూలాణ్ణి. మా దేశంలో ''స్వామి'' అంటే ''భూస్వామి'' అని అర్ధం. మా తాత ముత్తాతలక్కడ భూస్వాములు. అన్నీ అమ్ముకువచ్చి యిక్కడ బానిసలయ్యాం. క్షమించండమ్మా! ఈ మాటలే ఆరోడ్డుమీద నిలబడి అంటే యీపాటికి నా చర్మం వలిచేసేవారు, మీరలాంటివారు కారని నాకు తెలుసు.

భార్య—మేమలాంటివాళ్ళం కాకపోయినా నీకు కష్టంగానే ఉన్నట్లుంది.

సామి—తోటివాడు ప్రక్కయింటో బాధపడ్తుంటే, నా కిష్టంగా ఎట్లావుంటుంది. ఇన్నాళ్ళకు-ఇప్పటికి-ఎంతచిన్న వాడయినా యీాయనొక్కడు-అవతరించాడు-మాకోసం దెబ్బలాట్టానికి. అంతేచాలు.

ఎలిస్—ఆయన నీకు తెలుసా?

సామి—ఇక్కడ దర్బాన్‌లోనే ఒకసారి చూశాను ... బాలసుబ్రమణ్యం అని మావాడొకణ్ణి ఒక తెల్ల ఆసామి చావగొట్టాడు-రెండేళ్ళకింద, పాపం వాడి పళ్ళుకూడా వూడిపోయినాయి. అప్పుడీ గాంధియే వాడితరపున వాదించి సాయంచేశాడు.

(బయట కొందరుపిల్లలు ''గాంధీ అదుగో! అదుగో గాంధీ!''అని అరుస్తారు. తెల్లవాళ్ళు పరుగెత్తుతున్న దృశ్యం గ్లాసు కిటికీలోంచి కనుపడుతుంది. గోల వినబడుతూంది. సామి కిటికీ దగ్గరకు పరుగెత్తివెళ్ళి చూస్తాడు.)

సామి—లాఫ్టన్ గారూ గాంధీగారూ వస్తున్నారమ్మా! అందరూ వాళ్ళదగ్గరకు పరుగెత్తుతున్నారు ... అయ్యొయ్యో! ఆయనమీద కలియబడుతున్నారు. పాడు దేశం! పాడుపుటక! బానిసలం! బానిసలకన్నా నీచమైన వాళ్ళం.

ఎలి—గాంధీ అంటే......ఆ సన్నపాటి ఆయనేనా ?

భార్య—ఆయనేలాగుంది.

ఎలి—అంతసన్నటాయన్ని కొట్టటానికి యింతమందెందుకూ (బయట గోల ఎక్కువవుతుంది) వాళ్ళాయన్ని చంపేటట్టున్నారమ్మా వాళ్ళ నాపెయ్యమని నాన్నగారితో చెప్పమ్మా వెళ్ళి......

భార్య—లోపలికిరా ఎలిస్-నువ్వు అటుచూడకు-రా.

ఎలి—నాన్నగా రేరమ్మా? నాన్నగారక్కడవుంటే-వాళ్ళని ఆపేశావారే!

భార్య—ప్రజలందరూ మంచి ఆవేశంలోవున్నారు; నాన్నగారక్కడ వున్నా వాళ్ళ నాపలేరు.

ఎలి—మరి నువ్వూ? నువ్వూ ఆపలేవా? నాన్నగార్నే ఆపేస్తావ్ గా నువ్వు.

భార్య — ఆపటానికి ప్రయత్నిస్తాను-ఎలిస్. నే నిప్పుడేవస్తాను. (గబగబా బయటకువెళ్తుంది)

సామి — ఓ! చాలామంది వస్తున్నారింకా! బాదేస్తున్నారు. కొడి గుడ్లూ-రాళ్లూ విసిరేస్తున్నారు.

(ఎలిస్ కూడా బయటకు చూస్తుంది)

ఎలి — అదిగో పాపం! ఆ ఫెన్స్ పట్టుకునిలబడ్డాడు అరరే! తూలి పడిపోతున్నాడు. ఇంకా రాళ్ళతో కొడుతున్నారు. అదిగో! అమ్మ కేక లేస్తోంది. ఎవరిదో గొడుగుపట్టుకొని అడ్డంగా నిలబడ్డది.

సామి — ఏం చెయ్యటానికీ చేతకానివాణ్ణి! ఏం చెయ్యటం చేతకాని దేశంనాది! ఛీ ఛీ. పాడు బానిసదేశం.

ఎలి — అదిగో! పోలీసులువచ్చారు, అమ్మయ్య! ఇహ జనాన్ని తరిమేస్తారు......అదిగో తరిమేస్తున్నారు.

(బయట గోల కొంతసేపటికి తగ్గుతుంది గాంధీని వెంట బెట్టుకుని అలెగ్జాండర్ సతి లోపలికి వస్తుంది. ఇంకా గొడుగు చేతిలోనే వుంటుంది. గాంధీ వళ్ళంతా దెబ్బలుతగిలి రక్తం కారుతూ వుంటుంది.)

గాంధీ— మీరు చేసిన సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి, చాలా సహాయంచేశారు. ఇహ మీరు మీగొడుగు మూసెయ్య వచ్చేమో! దాని అవసరం దీరిపోయిందిగా?

భార్య — అవును. ఇక మీరీయింట్లో నిర్భయంగా వుండచ్చు. ఇది ఒక పోలీస్ ఆఫీసర్ గారి యిల్లు.

గాంధీ—అంతకంటె దయార్ద్రహృదయంగల యిల్లాలి యిల్లంటే బాగుంటుంది.

ఎలిస్—బాగా రక్తం కారుతున్నాయి గాయాలు.

భార్య—ఓ-చాలా దెబ్బలు తగిలాయిల్లాగుంది.

గాంధి—ఆ-చిన్న చిన్నవే! త్వరగా మానిపోతాయిలెండి.

భార్య—మాని మచ్చలు పడుతాయి. మచ్చలు శాశ్వతంగా నిలిచిపోతాయి

గాంధి—కాదు. పొరపాటుపడ్తున్నారు. ఏమచ్చ అయినా మరిచిపోలేనంతగా ఎప్పుడూవుండదు.

భార్య—ఏమో! నా కేమాత్రం నమ్మకంలేదా మాట మీద.

గాంధి—నమ్మటం ఒక లలితకళ. అది నేర్చుకుంటేగాని వచ్చేదికాదు.

[Mr. అలెగ్జాండర్ బయటనించి ప్రవేశిస్తాడు]

భార్య—వీరే మావారు Mr. అలెగ్జాండర్.

గాంధి—(నవ్వుతూ) మీపరిచయం కలగటం నా అదృష్టం. నేను పూర్వం మీ యింటో తలదాచుకున్న వాణ్ణి.

అలె— అవును. ఒక తిరుగుబాటుదారునూడాను.

గాంధి—అదినాకో బిరుదు అవాలంటే ఆమాటకో విశేషణం కలపాలి. అహింసాయుతమయిన తిరుగుబాటు నాది.

అలె రోడ్డుమీద జరిగినదంతా జ్ఞాపకంపెట్టుకునే అంటున్నారా ఆమాట?

గాంధి—ప్రాణాలుపోతున్నప్పుడుకూడా ఆమాటే అంటాను.

అతె—బహాయిగామాట్లాడకండి. ఉద్రేకంలో జనం ఏంచేస్తారో వాళ్ళకే తెలియదు. ఎముకలు లెక్కపెట్టివాటాలు పంచుకుంటారు. జాగ్రత్త.

గాంధి—కాదు. ప్రజలమంచి ప్రవర్తనమీద నా కెంతో నమ్మకం వుంది.

అతె—ఆనమ్మకం ఈదెబ్బతో పోయివుండాలె. ఇంకా పోలేదూ?

గాంధి—ఎట్లా పోతుంది! నా ఎముకలు పోగుచేసి వాళ్ళు భాగాలు పంచుకుంటున్నారా యిప్పుడు? లేదుగా! అబద్ధపు ప్రచారాలతో వారి ఉద్రేకాలు రేకొట్టారు. నేను మాయిండియాలో నేటాల్ తెల్లవాళ్ళను గూర్చి ఏమేమిటో చెప్పానని, నేటాల్ దేశాన్నే నల్లవాళ్ల వలసలతో ముంచెయ్యదల్చుకున్నాననీ, నాతోపాటు రెండు ఓడలనిండా నల్లవాళ్ళు వచ్చిదిగుతున్నారనీ ఇక్కడ మీవాళ్ళు విషప్రచారం చేశారు. అమాయకపు ప్రజలు ఆమాటలు నమ్మారు—ఫలితం యిది.

భార్య—కానియ్యండి. అదంతా యిప్పుడెందుకు? కాస్త విశ్రాంతి తీసుకోండి—ఇంతలో మీకు టీ చేసి యిస్తాను.

గాంధీ—క్షమించండి; నా కేమీ వద్దు. నేను త్వరగా "రుస్తుంజీ"ని కలుసుకోవాలి. ఈ లాఫ్టన్ గారేమయ్యారో?

భార్య—ప్రజలు ముందాయన్ని పట్టుకు దూరంగా లాగేశారు.

గాంధీ—తర్వాత నాకు తన్నులూ, రాళ్లూ, కోడిగ్రుడ్లూ యిచ్చి సన్మానించారు.

భార్య—అది సన్మానమా! అంత జరిగినా ఇంత వేళాకోళంగా మాట్లాడుతున్నారేం మీరు?

గాంధీ—(నవ్వి) మరేం లేదు. తన్నులు తినటం నా కిది మొదటిసారి కాదు గాని-రాళ్ళ దెబ్బలు తినటం మొదటి సారే. మొదటిసారి తన్నులు తిన్నప్పుడు చాలా బాధ పడ్డాను. కాని ఈ తడవ ఆ బాధ లేదు. బహుశా! ఈ తడవ గెలుపు నాదవటాన "బాధ" అనిపించటం లేదు.

అతె—ఆ! గెలుపు నీదే! దానికి మెడల్సులు కూడా వచ్చాయి. ఇవిగో మెడల్సులు. (గాయాలు చూపిస్తాడు)

గాంధీ—ఆ! ఔరే! మరే! ఇంతేకాదు. ఇంకా చాలా గెల్చాను. అయితే గెల్చింది పైకి కనిపించేదికాదు. దయార్ద్ర హృదయాల్లో మాత్రం కనిపిస్తుంది. ఇవ్వాళ మీ భార్య చేసిన పనికి సౌత్ ఆఫ్రికా చేసిన తప్పు లన్నింటినీ మర్చి పోగలను. అమ్మా! చరిత్రలో సల మీపాదరక్షల్లో నేను నిలబడి గర్వించగల భాగ్యంకోసం పరితపిస్తారు. మీ యిద్దరికీ నా కృతజ్ఞత. సెలవు తీసు కుంటాను.

భార్య—ఇప్పుడే బయలుదేరుతారా! ప్రమాదం కాదూ.

గాంధి—ఫర్వాలేదు. ప్రజలు తమ తప్పు తాము తెల్సుకుని పశ్చాత్తాప పడ్తారు లెండి.

అలె—ఆగండి. నేనూ మీతో వచ్చి యిద్దరు పోలీసుల్ని మీతో పంపిస్తాను.

గాంధీ—కృతజ్ఞుణ్ణి–పదండి. (ఇద్దరూ వెళతారు)

భార్య—ఏమి విచిత్రమైన వ్యక్తి! చూస్తుంటే మనిషిలాగా లేదు.

ఎలిస్—మనిషి కాక మరెవరమ్మా?

భార్య—మరెవ రంటానికీ, మాట దొరకటం గూడా లేదు. (అప్రయత్నంగా) నాకోసం మీరు దుఃఖించవద్దు. మీ కోసమే–మీ పిల్లలు కోసమే మీరు దుఃఖించండి.

ఎలి—బైబిల్ చదువుతున్నావా అమ్మా.

భార్య—ఆ–మరే బైబల్ చదువుతున్నాను.

[అలెగ్జాండర్ తిరిగి ప్రవేశిస్తాడు]

అలె—ఆయన్ని చక్కగా పాకేజీ కట్టి పంపేశాను. కాని ప్రజలింకా కనిపెట్టేవున్నారు. ఎక్కడ వాళ్ళక్కడ యుంచాక పారిపోయ్యారే గాని, మళ్ళాగుంపులు గూడు తున్నారు. పాటలు గూడా పాడుతున్నారు.

(పాడుతూ) "గాంధిని పట్టుకు కట్టెయ్యండి, ఏపిల్ చెట్టుకు ఉరివెయ్యండి"

భార్య—మళ్ళీ పట్టుకుని అల్లరి చెయ్యరుగదా?

అలె—ఏర్పాట్లు చేసే వచ్చాలే.

(మళ్లా పాడతాడు)

భార్య—ఇదేమిటి! ఇక్కడ చేరి పాటలు పాడుతూ చిందులు తొక్కుతున్నా రేమిటి!

అలె—పాట బాగుండలేదూ! బలే తాళం పడుతోంది,
(తాళం వేస్తాడు)

భార్య—పోలీసు ఆఫీసర్లు పాడాల్సిన పాట కాదిది.

అలె—నేనేం చేసినా నీకు నచ్చదు.

భార్య—నచ్చేపని చేస్తే నచ్చకేం చేస్తుందీ? (నవ్వుతాడు) ఈదేశంలో నల్లవాళ్ళకో చట్టం తెల్లవాళ్ళకు మరోచట్టం వుందా ఏమిటి?

అలె—పోలీసు ఆఫీసర్‌గా చెప్పాలంటే—లేదు.

భార్య—తెల్లవాళ్ళల్లో ఒకరుగా చెప్పాలంటే......

అలె—ఓ! చాలా చట్టాలున్నాయి; ఎందుకు? తెల్లవాడు నౌకరయినా వాణ్ణి తిట్టటానికీ తన్నటానికీ వీల్లేదు-వాడు రైల్లో ఏక్లాసులో నయినా ఎక్కొచ్చు. గోష్టుపిుాద యిష్టం వచ్చినట్లు నడవ్వొచ్చు. రాత్రి 9 గం॥ల తర్వాత ఎవ్వరి పర్మిషన్ లేకుండా ఎక్కడికిపడితే అక్కడికి పోవచ్చు. తలపాగా లేకుండా యజమాని ఎదట నిలబడ వచ్చు...ఇండియన్లు యిదేం చేయటానికి వీల్లేదుగా.

భార్య—దానికి కారణం యిండియాలో పుట్టటమేనా?...

అలె—కాదు-దానికి కారణం "మేం యిండియాలో పుట్టా మని చెప్పుకోవటం." కొందరు యిండియన్లే అరబ్ లమని చెప్పుకుని చలామణి అయిపోతార్లే.

భార్య—మరి గవర్నమెంటు చూస్తూ వూరుకుంటుందేం?

అలె—గవర్నమెంట్ ఉద్యోగస్తుడుగా మాట్లాడితే ఊరు కుంటుందన్న మాటకు నే నొప్పుకోను. గవర్నమెంటు యిండియన్లకి ఓటు హక్కు-కూడా యిచ్చారు.

భార్య—కాని నా భర్తగారు చూట్టానికే బాగుంటాది కాసేపు.

అలె—అయితే అసలు రహస్యం చెప్పేస్తాను. అసలు రహస్యం యిండియన్లు మంచి కష్టజీవులు. ఒళ్ళొంచి పని చేస్తారు. డబ్బు వృథాగా ఖర్చుచేయరు. అందువల్ల తోడి తెల్లవాళ్ళకంటె బాగా కూడబెట్టి డబ్బు నిలవేస్తున్నారు. ఇదిచూచి తెల్లవాళ్ళ కన్నెర్రనయింది. ఇండియన్లు చాలావరకూ రాతికోతలు రానివాళ్ళూ నోరులేని నిస్సహాయులూ కనకా — —

భార్య—వాళ్ళది బానిసదేశం గనకా—

అలె—ఆ-ఇదంతా బయలుదేరింది.

[సామి వస్తాడు]

అలె—సామీ! నీ జీవితం యిక్కడ బాగుందోయ్.

సామి—ఈ యింట్లోనా అండీ.

అలె—కాదు-ఈ ఆకాశంక్రింద.

సామి—నాకు పుట్టిన దగ్గరనించీ సౌత్ ఆఫ్రికా ఆకాశం ఒక్కటే తెలుసు,

అలె—నా ఉద్దేశ్యంకూడా దానిక్రిందనే లే!

సామి—బాగుండ లేదనే అనాలి.

అలె—మరి బాగుండనప్పుడు మీ దేశానికి మీరు పోరాదూ?

సామి—వెళ్లాలనే అనుకుంటూ చాలాసార్లు. చాలామందికి వెళ్ళమనే చెప్పాను. కాని ఎట్లా వెళ్ళటం. వెళ్ళటానికి

ఓ...రిక్కట్టన్నా ప్టుకో చేను. ఉన్న గుడ్డా గోచీ యిక్కడేవున్నాయిగాని నాఅన్న దేమీ ఆ దేశంలో లేదు. మా తాతలు యిక్కడేదో బాపుకుందామని ఉన్నదంతా ఊడ్చుకొని వచ్చారు. మాతల్లిద్రులు మమ్మల్ని బానిసల చేసి పోయారు. మాది యీ దేశమే అయిపోయింది.

(బయట Boor bell మోగుతుంది.)

అలె — ఎవరో వచ్చారు చూడు.

[వాడు వెళ్ళి తలుపుతీయగా లోపలికి యిద్దరు డిటెక్టివ్ ఇన్స్పెక్టర్లు వస్తారు]

1వ డి — రుస్తుంజీయింటిదగ్గర జనం గుమిగూడారుసాన్. గాంధీని బయటికి రమ్మని గోలచేస్తున్నారు.

2వ డి — ఈపాటికి ఇంట్లోజొరబడ్డారేమోగూడా.

అలె — అంతేకావాలి. లేకపోతే చెప్పినమాట వినకుండా బయలుదేరాడు. ఇప్పుడు నేను బయలుదేరి వెళ్ళి—బుర్ర లేని ప్రజల కెదురునిల్చి—విసిరే రాళ్ళకు నాతల అడ్డం పెట్టాలి.

భార్య — పోలీసు ఆఫీసర్ గా అదిమీ విధిఅనుకుంటాను!

అలె. అవునవును. సిభర్తగాయింకా కాసేపు యిక్కడే వుంటే కోడిగ్రుడ్లు నువ్వే విసిరేటట్టున్నావ్. పదండయ్యా (బట్టలుసర్దుకుని బెల్టుపెట్టుకుంటూ పాటపాడతాడు)

అలె — గాంధీని పట్టుకు కట్టెయ్యండి ; ఏపిల్ చెట్టుకు ఉరితియ్యండి. (అందరూ నవ్వుతూ వెళతారు)

ఎలి—వాళ్ళు గాంధీని చంపుతారేమోనమ్మా! నువ్వుకూడా నీ గొడుగు పుచ్చుకెళ్ళి వాళ్ళని చావగొట్టు కూడదూ.

భార్య—చావగొట్టటమా!

ఎలి—ఆ! నాన్న దగ్గిర తుపాకులున్నాయిగా.

భార్య—అది కక్షతీర్చుకోవటమే అవుతుంది. మన క్రిష్టియన్ ఆచారంలో కక్షకట్టటం పనికిరాదు.

ఎలి—మరియిల్లా కొట్టటం పనికివస్తుందా!

భార్య—ఆ సంగతులన్నీ నీ కింకా బాగా తెలియవులే. నాన్నగారు వెళ్ళారుగా! ఏ అపకారం జరగకుండా చూస్తారు. నాన్నగారు మంచిక్రిష్టియన్, ధర్మబుద్ధి గల వారే. (ఫోన్ మ్రోగుతుంది భార్య వెళ్లి ఫోన్ ఎత్తి మాట్లాడుతుంది.)

భార్య—హల్లో! నేనండీ, Mrs. అలెగ్జాండర్! యింట్లో లేరు. బయటకెళ్ళారిప్పుడే, ఆ. ఆ. గాంధీ—దేదో గోల జరుగుతోందని కబురొస్తేనూ, ఆ...ఆ...రుస్తుంజీ యింటిదగ్గరే. ఆ–ఆ–మళ్ళీ కబురు చేస్తాలెండి. ఆ. (phone పెట్టేసి) సామీ! సామీ! తొందరగా వెళ్ళు! కేబినెట్ మంత్రిగారి దగ్గర్నించి కబురు వచ్చింది. గాంధీ నెల్లాగన్నా కాపాడమనీ ఫోన్ చేశారు. చీటీవ్రాసి యిస్తాను. త్వరగా వెళ్ళి ఆయన కియ్యి.

(భార్య గబగబా చీటీ వ్రాసియిస్తుంది; సామి తీసుకు పరుగెత్తుతాడు.)

ఎలి—మనంకూడా వెళ్దాం పదమ్మా.

భార్య—ఎందుకూ?

ఎలి—మనంకూడా అడ్డంపడి దెబ్బలుతగలకుండా చూద్దాం.

భార్య—వద్దు తల్లీ. ప్రజలికి మంచిబుద్ధి పుట్టించేందుకు యిక్కణ్ణించి భగవంతుణ్ణి ప్రార్థిద్దాం. మనప్రార్థన వృథాగాపోదు. భగవంతుడు మనల్నెప్పుడూ భంగపుచ్చడు.

ఎలి—అయితే తొందరగా ప్రార్థిద్దాంపట్టు. తొందరగా భగవంతుడాయన్ని రక్షిస్తాడు.

(ఇద్దరూ ప్రార్థిస్తారు. ప్రార్థన అయిపోయినతర్వాత)

ఎలి—ఓ భగవంతుడా! ఇల్లా బాధపడటానికి గాంధీ ఏ తప్పూ చేయలేదు. నీకుమల్లేనే ఆయనా నిర్దోషి. నీకుమల్లేనే ఆయనా ఏపాపమూ ఎరగడు. ఆయన్ని రక్షించు— ఆయన క్రిష్టియన్ కాకపోయినాసరే. ఏమెన్,

[సామి గబగబా పరుగెత్తుకు వస్తాడు.]

సామి—ప్రజల్లోకి చొచ్చుకుపోయి చీటీ అందిచ్చానమ్మా— చాలామందిజనం చేరారు. అబ్బా! ఇసుకవేస్తే రాలటం లేదు.

భార్య—చీటీ చూశారా ఆయన? ఏమన్నారు?

సామి—ఊరికే వకసారి తలవూపారు. మళ్ళా పాటపాడటం మొదలెట్టారు.

భార్య—పాట పాడటమా?

సామి—(కోలుకొని) ఎవరో నామీద కోడిగుడ్డు విసిరారు పకున్నా—ఇక్కడే తగిలింది. నొప్పి పుడుతోంది.

ఎలి—బాగా నొప్పిగా వుందా?

సామి—ఆ-

ఎలి—కాస్త కాపు పెడ్తా నాగు.

సామి—వద్దులే అమ్మాయ్. వద్దులే! అంతా తగ్గాక చూసు కుందాం. అక్కడ అట్లా.........

ఎలి—కాదులే! నామాట విను. కొంచెం కాపు పెడితే బాధ తగ్గుతుంది. తర్వాత యిద్దరం వెళ్ళి ఆ గాంధీగారి గాయాల కూడా కట్లుకట్టి కాపు పెట్టి వద్దాం.

సామి—వాళ్లాయన్ని ప్రాణాల్తో వదుల్తేగదా?

ఎలి—ఫరవాలేదు. నేనూ అమ్మా యిప్పుడే భగవంతుణ్ణి ప్రార్థించాం! గాంధీజీ క్రిస్టియన్ కాకపోయినా జీసస్ ఆయన్ని రక్షిస్తాడు.

సామి—జీసస్‌ను మళ్ళీ ప్రార్థిద్దాం—ప్రార్థిద్దాం—అంతకంటే ఏమీ చేయలేని దౌర్భాగ్యుణ్ణి—ఏంచేస్తాను—యింతకంటే—

ఎలి—అలాగే ప్రార్థిద్దాం—మొన్న నువ్వే—కథ చెపుతూ, మీ దేముళ్ళల్లో నాలుగుచేతుల దేముడున్నాడన్నావే! ఆయన్నిగూడా ప్రార్థించు. ఇద్దరూ కలసి గాంధీని రక్షిస్తారు.

సామి—నేను ప్రార్థిస్తూనే వున్నానమ్మా! ప్రార్థిస్తూనే వున్నాను. కాని ఎంత ప్రార్థించినా ఏం ప్రయోజనం కనిపించడం లేదు.

ఎలి—ప్రార్థనలో విశ్వాసముండాలి సామీ, విశ్వాసం వుంటేను గాని ప్రార్థన ఫలించదు. నిజమైన క్రిష్టియన్ లాగ నువ్వు మీ దేముణ్ని ప్రార్థించు-దేముడు, ప్రార్థించిన వాళ్ళెవరైనా సరే భంగపుచ్చడని అమ్మ చెప్పింది. ఆడవాళ్లైనా సరే-మగవాళ్లైనా సరే అమ్మమాటలు నిజమో కాదో ఇప్పుడు తేల్తుందిగా? ప్రార్థిద్దాం రా.

సామి—ఈ ప్రపంచం సంగతి నీకింకా తెలియదమ్మా! ఇది నువ్వనుకున్నంత మంచిది కాదు.

ఎలి—అయితే దేముడు-కూడా మంచివాడు కాడా?

సామి—కానీ ప్రార్థిద్దాం పట్టు.

(ఇద్దరూ ప్రార్థిస్తారు-బయట ఎవరివో మాటలు వినిపిస్తాయి.)

సామి—ఏమిటది? ఏవో మాటలు వినిపిస్తున్నాయి! ఎవరో వచ్చారు.

ఎలి—నా ప్రార్థన భగవంతుడు విన్నాడు. భగవంతు డెవర్నీ భంగపుచ్చడు.

సామి—ఎవరో తలుపు కొడుతున్నట్లున్నారు.

ఎలి—భగవంతుడే తలుపు తీస్తాడు.

[తలుపు తీసుకుని, గాంధీ యిండియన్ పోలీసు వేషంలోనూ డిటెక్టివ్‌లు యిండియన్ వర్తకుల వేషాలలోనూ లోపలకు వస్తారు]

1వ డి—అలెగ్జాండర్ గారి భార్య లేరా-యింట్లో?

సామి—వా రిప్పుడే బయటకు వెళ్ళారంటే, రుస్తుంజీయింటి వైపుకు వెళ్ళారు.

2వ డి—అహా-గుర్తొచ్చేను. మేం కానేపక్కడే వుంటాం. ఈ లోపుగా యూకొన్ని చెం నూనె తెచ్చిపెడ్తారా? ఈ రంగు తుడిచెయ్యాలి ముందు.

సామి—రంగా! తుడిచెయ్యాలా!

డిటె—ఆ-మేం రంగేసుకుని వేషంలో వున్నాం. తెలియటం లేదూ.

గాంధీ—(కానిస్టేబుల్ వేషంలో) పాపం! గుర్తుపట్టలేక పోతున్నాడు అయితే మనవేషం బాగా వేసుకున్నా మన్నమాట! ఆ-నువ్వు తమిళదేశం నుంచి వచ్చినట్టు న్నావు కాదూ?

సామి—మరే తమిళదేశాన్నుంచే వచ్చాను.

గాంధీ—బాగుంది. కాస్త నూనె తెచ్చి యియ్యి ముందు. ఈ వేషంలో ఏమిటో చిన్నతనంగావుంది....అరే! ఈ చిన్నపిల్ల మమ్మల్ని చూచి యింత తెల్లబోయిందేం?

ఎలి—నేను మిమ్మల్ని గుర్తుపట్టాను,

గాంధీ—నన్ను గుర్తుపట్టావా? లేదు. నువ్వెప్పుడూ నన్ను చూడనన్నా లేదు.

ఎలి—ఇవ్వాళ పేపర్లో మీ బొమ్మను చూచాను. తర్వాత యింటాక మీ-రిక్కడికి...

గాంధీ—అహా-అవునవును. నన్ను ప్రజలుగూడా వీధుల్లో చూసే గుర్తుపట్టారు-మొదట. కాని నే పట్టుపడ్లా లేనుగా ?

ఎలి.—తర్వాత వాళ్ళతో మీ రిక్షాకి వచ్చినప్పుడు చూశాను.

గాంధీ—ఓహో! అయితే మా వేషాలు నీ దగ్గర లాభం లేదన్నమాట. అదసరే; ఇప్పుడు నన్ను గుర్తుపట్టావుగా! మరి నామీద రాళ్ళు రువ్వ బుద్ధిపుట్టటం లేదూ నీకూ ?

ఎలి—వాళ్ళందరితరపున నేను క్షమార్పణ అడుగుతున్నాను.

గాంధీ—(నవ్వి) ఒద్దొద్దు. వాళ్ళమీద నాకేం కోపం లేదు. పాపం! వాళ్ళకేం తెలియదు.

1వ డి—నిజంగా వాళ్ళమీద మీకేం కోపం లేదూ ?

గాంధి—లేదు. నిజంగా నే లేదు.

2వ డి—వాళ్ళు మిమ్మల్ని చంపెయ్యాలని వచ్చారుగా అప్పుడూ కోపం లేదా ?

గాంధీ—అప్పుడూ కోపం లేదు. నిజానికి రుస్తుంజీకి నావల్ల యిబ్బందు లొచ్చాయిగదా అని చాలాసేపు చింతించాను. తర్వాత నే నిల్లా మారువేషంలో తప్పించుకోవల్సి వచ్చిందిగదా అని సిగ్గుపడుతున్నాను.

1వ డి—ప్రాణంమీదకు వచ్చినప్పుడు ఏ మార్గమయితేనేం తప్పించుకోటానికి.

గాంధీ—కానీ ఇక్కడో గమ్మత్తు జరిగింది. లాఫ్టన్‌గారితో ఏ అపాయాన్నైనా ఎదుర్కొంటానంటూ ఈ రోడ్డు

వెంటే వెళ్ళి యింకా రెండుగంటలు కాలేదు. కాని నిజంగా ప్రాణాపాయం వచ్చేసరికి ఇల్లా దొడ్డిదోవన మారువేషంలో పారిపోయివచ్చాను ఓకంట, సింహంలాగా గర్జించటం, ఇలా గర్జించానని గర్వంగా చెప్పుకునే లోపునే పిల్లిలాగా పిరికితనాన్ని ప్రదర్శించటం!!
(అంటూ వేషం తీసివేస్తాడు)

ఎలి—మిమ్మల్ని ఒక్కమాట అడగాలనుంది.

గాంధీ—తప్పకుండా అడగవచ్చు.

ఎలి—మీరు జీసస్ క్రీస్తు నెప్పుడైనా చూశారా?

గాంధీ—నేనా! ఎట్లాచూడటం? ఆయన్ని గురించి చదివానంతే ఆయన అడుగుల్లోనే అడుగు వేస్తూంటూ ఆయన దోవనే పోతూ వెళ్ళాలనివుంది.

ఎలి—వద్దు. వెళ్ళకండి.....ఆముళ్ళే మీకాళ్ళ గుచ్చుకుంటాయి.

గాంధీ—కాని ఆయన్ని ముళ్ళుగుచ్చుకొన్నా బాధపెట్టలేదుగా?

(సామి నూనె పట్టుకువస్తాడు [illegible] వేషం తీసేస్తారు. ఇంతలో బయటనుంచి అలెగ్జాండర్ భార్య వస్తుంది)

భార్య—మీరు గాంధీ కాదూ?

గాంధీ—అవునండీ; మీ భర్తగారు నన్ను పట్టుకొని ఉరి తియ్యాలని జనంతో చేరి పాటపాడుతూ, నాకు తప్పించుకు పోవటానికిదో వేషకల్పించారు.

భార్య—మీ దోవలో ఏ యిబ్బందీ రాలేదుగదా?

గాంధీ—ఏ యిబ్బందీ లేదు. మీ దంపతులిద్దరికీ ఈ మిత్రు
లిద్దరికీ కూడా చేసిన సహాయానికి నా కృతజ్ఞత.

2వ డి—ఇంతకూ అక్కడగోల ఎట్లావుందండీ.

భార్య—ప్రజల్లోంచి ఇద్దరు ప్రతినిధులు బయలుదేరి వెళ్ళి మస్తుంజీ యిల్లంతా వెతికి నిరాశతో తిరిగి వచ్చారు. చాలామంది నసుగుతూ యిళ్ళకు వెళ్తున్నారు. కొందరీయన చాతుర్యానికి మెచ్చుకుంటూ తిరిగి పోతున్నారు.

(బయట అలెగ్జాండర్ పాట వినిపిస్తుంది. అందరూ అటు చూస్తారు)

"గాంధీని పట్టుకు కట్టెయ్యండి; ఏపిల్ చెట్టుకు ఉరి తియ్యండి" అంటూ పాడుతూ వచ్చి గాంధీని చూచి ఆగి పోతాడు. అలెగ్జాండర్)

అలె—ఓ! నువ్వా నాయనా!

గాంధీ—నేనే.

అలె—ఇంకెందుకీ వేషం! తీసెయ్యండి.

గాంధీ—విధేయుణ్ణి! ఈ దుస్తులంత సౌఖ్యంగా లేవులెండి.

అలె—మిమ్మల్ని మళ్ళీ ఆజనం మధ్య పడేసి నవ్వగలరేమో మరోసారి చూడాలని వుంది.

గాంధి—హృదయపూర్వకంగా నవ్వటానికి ప్రయత్నిస్తాను.

భార్య—(భర్తను వారిస్తూ) మీరు బొత్తిగా మర్యాదమర్చి పోతున్నారు.

అలె—ఈయన్ని చూస్తుంటే ఎవ్వరయినా మర్యాదా మర్చిపోతారు. ఈయన నెక్కడ నుంచుంటే అక్కడ పోలీసుల్కూ తలనొప్పి పుట్టిస్తాడు. మంచివాళ్ళయితేనే

చెడ్డవాళ్ళయితేనేం పోలీసువాళ్ళకి తలనొప్పి పుట్టించిన తర్వాత.

గాంధీ—మీకు చాలా శ్రమ యిచ్చాను. మరేం అనుకోకండి.

ఎడి—ఆయన తప్పేం చేశాడు నాన్నా? అలాకోప్పడు తున్నాడు?

అతె—ఇంకేం చెయ్యాలింతకంటే! నామాట వినకుండా, మంత్రి ఎన్నాంబీగారి మాట వినకుండా. రుస్తుంజీ యింటికి బహిరంగంగా కలుసుకుతూ... వెళ్ళట మెందుకూ? తర్వాత అందరిజనంతో, నేను నానా అవస్థపడ్తూ—తొందరగా పారిపొమ్మని అన్ని సార్లు కబురుపంపినా కదలకుండా కూర్చోట మెందుకు? ఆ జనంలో చేరి ప్రాణాలు చేతిలో పెట్టుకుని, నానా పాటలు పాడి, నాకొంతు ఎట్లా బొంగురు పోయిందో.

(బయట కాలింగ్ బెల్ శబ్దం వినబడుతుంది)

అతె—ఎవరది! మళ్ళా అల్లరిమూక తయారయిందా?

(ఒకటవ డిటెక్టివ్ బయటకు వెళతాడు)

భార్య—మీ రిక్కడున్నారని తెలిస్తే వచ్చిపడ్తారు మళ్ళీ.

2వ డి—కాని ఎట్లా తెలుస్తుంది? తెలియదు లెండి.

[ఒకటవ డిటెక్టివ్ తిరిగి వస్తాడు]

1వ డి—పత్రికా విలేఖర్లు వచ్చారు. మిమ్మల్ని చూడటానికి.

2వ డి—అరే! గాంధీ యిక్కడున్నాడని అప్పుడే వీళ్ళ కట్లా తెలిసింది!!

అతె—వారి కన్నీ జరగకముందే తెలుస్తాయిలే.

2వ డి—గాంధిగారితో ఇంటర్వ్యూకొచ్చారా!

అలె—ఆ–ఆ–ఇంటర్వ్యూకే! రేపొద్దున్న ఈపాటికి సాళ్ళ జనాన్ని యిక్కడికి తోలద్దాం.

గాంధీ—ఫర్వాలేదు–రమ్మనండి.

[1వ డిటెక్టివ్ బయటకు వెళ్ళి విలేఖర్లతో తిరిగి వస్తాడు. అందులో ఒక విలేఖరి "నేషనల్ ఎడ్వైజర్" పత్రిక బాపతువాడు]

1వ వి—గుడ్ మార్నింగ్ మిస్టర్ గాంధి.

గాంధి—గుడ్ మార్నింగ్.

1వ వి—నేను "నేషనల్ ఎడ్వైజర్" పత్రికా విలేఖర్ని.

గాంధి—అలాగా! రండి. కూర్చోండి.

అలె—కూర్చోండి. కాని మీరు ముందు నాకు ఇంటర్వ్యూ యివ్వాలి. గాంధీ యిక్కడున్నట్లు మీకెట్లా తెలిసిందో ముందు చెప్పండి

1వ వి—అది! అది మా అదృష్టం! దుమ్ముంకే యిందాకొసటి వీధుల్లో గన్నీబస్తాలు కుప్పలు కుప్పలుగా వున్నాయి వాటిలో ఈ చీటీ మాకు దొరికింది. (అని ఒక చీటీ అందిస్తాడు)

అలె—చీటీయా! ఏదీ!...(చదివి) అరే!! ఇది నేను గాంధికి రాసి పంపించింది.

1వ వి—ఆ–దాన్ని బట్టే మేం అంతా గ్రహించాం.

అలె—(గాంధిని చూచి) అయితే నేనంత గోలపడ్తూ వ్రాసిన ఉత్తరం యింత నిర్లక్ష్యంగా ఎక్కడో పడేశారన్న మాట.

1వ వి—కాని మీరు చాలా జాగ్రత్తగా సత్యాగ్రహం చేశారు. మీరలా చేయకపోతే చాలా గొడవ జరిగేది. మేము ముందు మిమ్మల్ని అభినందించాలి.

అతి—నేను కూడా పెద్దల్ని. నా పక్షం కతులతాన్ని అభినందించాలి. ఆజనంలో ఎవరికన్నా చీటీ పోలీకిప్పుడు నన్ను చితక పొడిచేవారు.

1వ వి—ఇక వీరితో మాట్లాడి వచ్చుగా? ఏమండీ! మీరు లక్షలాది ఇండియన్లను తీసుకొచ్చి సౌత్ ఆఫ్రికాలో దింపేద్దామని ప్రయత్నిస్తున్నారట నిజమేనా?

గాంధి—లేదు. నాకా ఉద్దేశ్యంలేదు. నాతో నా భార్యా పిల్లలుతప్ప మరెవ్వరూ రాలేదుకూడా! ఇక్కడ ఓడ దిగింది నేనొక్కడ్నే. రెండో ఓడ మా వెనక వస్తున్న సంగతి నాకుఅసలు తెలియదు. ఇక్కడకొచ్చిన తర్వాత తెలిసింది. వాళ్ళందరూ ట్రాన్సువాల్ వెళ్ళేవారు. వాళ్లు అక్కడకయినా కొత్తగా వస్తున్నవాళ్ళు కాదు. పాత వాళ్ళే. ఇది ఎవరు విచారించినా తెలుస్తుంది.

2వ డి—నేటాల్ తెల్లవాళ్ళందర్నీ ఖండిస్తూ మీ దేశంలో చాలా ఉపన్యాసాలిచ్చారటగా?

గాంధీ—అదీ అబద్ధమే. నే నిక్కడ వుండగా ఏమేంమాట్లాడానో అవ్వే అక్కడా చెప్పాను. అంతకుమించి ఒక్క మాట చెప్పలేదు. ఇటువంటి యిబ్బందులు వస్తాయనే. అక్కడ అన్నీ వ్రాసిన ఉపన్యాసాలే యిచ్చాను. కావాలంటే ఆ కాపీలు నాదగ్గర వున్నాయి. చూపిస్తాను.

(బయట calling bell మ్రోగుతుంది ఒకటవ డిటెక్టివ్ బయటకువెళ్ళి తిరిగివచ్చి)

1వ డి.— కేబినెట్ మినిష్టర్–ఎస్కాంబీ వచ్చారు Mr. గాంధీతో మాట్లాడటానికట.

[అలెగ్జాండర్ బయటకువెళ్ళి ఎస్కాంబీతో తిరిగి వస్తాడు]

ఎస్కా.—(వస్తూనే) జరిగినదంతా విన్నాను. Mr. గాంధీ! జరిగినదానికి నాకుచాలా విచారంగావుంది. మీకు తగిలిన ప్రతిచిన్నదెబ్బ కూడా నాకుఎంతో సంతాపం కలిస్తున్నాయి. మీరు లాఫ్టన్ గారి సలహా ప్రకారంనడుచుకోటానికి మీకు సంపూర్ణమైనహక్కువుంది. లేదనికాదు అయినా.........

1వ వి.—ఆ సలహా అందరూ పాటించగలిగే సలహా కాదుగదండీ?

ఎస్కా.—ఓ! మీరు పత్రికావిలేఖరులుకాదూ! అప్పుడే మీా రిక్కడికెట్లా వచ్చారు? (అందరూనవ్వుతారు) Mr. గాంధీ! మీరు నాసలహాకూడా పాటించివుంటె యింత గోల జరిగేదికాదు,

గాంధి.—నిజమే.

ఎస్కా.—మిమ్మల్ని బాధపెట్టినవారిలో ఎవరినన్నా మీరు గుర్తించగలరా?

గాంధి.—గుర్తించగలను.

ఎస్కా.—వాళ్ళ పేర్లేమన్నా తెలునా?

గాంధి.—తెలుసు. ఒకరిద్దరిపేర్లు చెప్పగలను.

ఎస్కాం—బాగుంది. తెల్లగానే తేల్తుందయితే. వారిపేర్లు చెప్పండి; వాళ్ళను అరెస్టుచేసిచట్టప్రకారం కేసుపెట్టిస్తాను.

గాంధి—క్షమించండి వాడికిశిక్ష వేయించాలని నాకు లేదు. దానివల్ల ప్రయోజనం లేదు. వారిమీదనాకేంకోపం లేదు. నేను మాయిండియాలో ఏవేవో అవాకులు చవాకులు వాగానని పేపర్లలో వ్రాశారిక్కడ. వాటినిచూచి వారు ఉద్రిక్తులయ్యారు. వారినాయకులు వారి ఉద్రేకాలను రెచ్చగొట్టారు. అదిచూస్తూ మీరూ మిన్నకున్నారు. మీరు క్షమిస్తే ఒకమాటచెప్తాను. మీరుకూడా దీనికి సహకారణం. కానియ్యండి. అయినదేదో అయింది. నిజం తెలిసినప్పుడు వారే పశ్చాత్తాపపడ్తారు.

ఎస్కాం—మీరట్లా అంటే నేనేం చెప్పలేను. కాని లండన్ నుంచి కలోనియల్ మినిస్ట్రీ నుంచి కేబుల్ వచ్చింది. Mr. చేంబర్ లేన్ నిందితుల్ని శిక్షించాల్సిందని కేబుల్ చేశారు.

గాంధి—అయినాసరే.

ఎస్కాం—మేమందరం కూడా మా చేతనయినంతవరకూ మీకు న్యాయంజరిగేటట్టు చూస్తాం.

గాంధి—Thanks నేరమంటే నాకసహ్యమే కాని నేరస్థులంటే జాలే.

ఎస్కాం—మీ వేదాంతం బాగానేవుంది. మాకు వీలుగా కూడావుంది. కానిమీరీనిశ్చయాన్ని వచ్చేముందు, కావాలంటే లాయర్ నెవరినన్నా సంప్రదిస్తే సంప్రదించండి.

గాంధి—అక్కరలేదు.

ఎస్కాం—అయితే సరే. ఇది కాగితంమీదవ్రాసియిస్తారా?

గాంధి—అల్లాగే. Mr. అలెగ్జాండర్! చిన్న కాగితం యిస్తారా? (పత్రికావిలేఖరులు కలం కాగితం యివ్వగా గాంధి వ్రాశి—కాగితం ఎస్కాంబీకి యివ్వబోతుండగా)

ప్రెస్—దయచేశి దీన్ని మేం కాపీ చేసుకోనిస్తారా?

గాంధి—అల్లాగే. (వారు కాగితం తీసుకుని కాపీ చేసుకుంటారు)

ఎస్కాం—ఈస్టేట్ మెంట్ వెంటనే లండన్ కు కేబుల్ చేస్తాను; దానితో మా బాధ్యత లేకండా పోతుంది.

గాంధి—అది కనిపిస్తూనేవుంది.

ఎస్కాం—మీ సంగతి నేను చాలా విన్నాను. మీరీ దేశంలో గాయిష్టం వచ్చినంత కాలం వుండవచ్చు—ఉండిమీ దేశస్థుల్ని మంచి దోవలో పెట్టాలనీ, నాకోరిక కూడానూ. ఇవ్వాల్టి మల్లే మా వాళ్ళను అవస్థపెట్టకుండా మాత్రం వుండండి.

గాంధి—నేనే మాత్రం జాతి విచక్షణాలేకుండా అందరి శ్రేయస్సు కోరుతున్నాను.

(విలేఖర్లు కాపీ చేసుకుని స్టేట్ మెంట్ తిరిగియిస్తారు. అది తీసుకొని)

ఎస్కాం—ఈస్టేట్ మెంట్ కి నా Thanks. నాపని చాలా తగ్గించారు. వస్తాను.

పత్రికా—మేమూ వెళ్ళివస్తాం.

గాంధి—అల్లాగే వెళ్ళిరండి.

అలె— Mr గాంధీ! పోలీసుఆఫీసర్ గా ఆలోచిస్తుంటే మీ తర్కమేమీ నా కర్థం కావటంలేదు.

గాంధి—పోలీసు ఆఫీసర్ గా మీరు ఆలోచించకండి. సామాన్య మానవత్వంతో ఆలోచించండి.

ఎలి—నాకు కాగానే అర్థమయిందినాన్నా! జీసస్ క్రీస్తు చెప్పినట్లు.

అలె—జీసస్ క్రీస్తు చాలా చెప్పాడు. నేరస్థులందర్నీ జైల్లోం వదిలేస్తే ఈపోలీస్ ఆఫీసర్లంతా ఎందుకూ?

గాంధి—ఎందుకో గవర్నమెంట్ వారి ఆర్డర్లు వస్తాయి. వేచి వుండండి.

అలె—ఆ!! ఆ జనమంతా మీ జుట్టు పట్టుకు పీకుతుంటే-నేనూ గవర్నమెంట్ ఆర్డర్లకోసం కాచుకూర్చుంటే అప్పుడు తెలిసేది.

గాంధి—ఆ! నా నెత్తిన ఎంత జుట్టుందిలెండి. వారికి గట్టిగా పట్టుకు కూడా చిక్కదు.

అలె—ఉన్న జుట్టు చాలు- నొప్పిపుట్టటానికి.

గాంధి—నొప్పి పుట్టక పోతుందని కాదు. వాళ్ళు జుట్టు పట్టుకునేది నొప్పిపుట్టటానికేగా! కాని ఆ నొప్పిలో మనం సౌఖ్యం అనుభవించాలి. అప్పుడు జుట్టుపట్టుకున్న వాళ్ళ చేతుల నొప్పులే మిగులుతాయి.

అలె—ఎలిస్ అన్నట్లు జీసస్ చాలా చెప్పా డిట్లాంటివి. చెప్పి చెప్పి జీవితాన్నే వృథా చేసుకున్నాడు. అనవసరంగా.

భాగ్య—ఛ. ఛ. అది అనవసరంగా కాదూ జీవితమూ వృథా చేసుకోలేదు, నిజానికి ప్రపంచాన్నే జయించాడు. ఓడిపోయింది మనం; ఆయన ప్రాణాల్ని ప్రజలు తీశామనుకున్నారు. ప్రజలహృదయాన్నే ఆయన గెల్చుకున్నాడు.

(ఎలిస్ చప్పట్లు కొడుతుంది.)

ఎరుకలి—ఏమిటిది ఎలిస్ ! అమ్మ గారూ వాగే సిచ్చిమాటలకి నువ్వూ చప్పట్లు కొడుతున్నావా యింకా ?

ఎలి—అమ్మ ఏదో చెపుతోందనీ నేను చప్పట్లు కొడుతున్నాననీ అనుకోలేదునాన్నా !

గాంధి—(నల్లని సామిని చూసి) ఆరే ! ఏమిటి ! యింకా నిట్లాగే నుంచుండి పోయాడేం యిందాకట్నించీ...

(సామి దగ్గర కెళతాడు)

సామి—ఏం లేదండీ ! మీకు చెయ్యెత్తి దణ్ణం పెట్టాలని మనసు ఆగాను. మమ్మల్ని రక్షించటానికి, మా బాధలు నివారించటానికీ వచ్చిన మహాత్ములు మీరు; మీ పాదాలొక్కసారి ముట్టుకో నివ్వండి, అంతే చాలు.

(పాదాల మీద వాలగా)

గాంధి—లేవయ్యా సిచ్చివాడా ! మీకు సేవ చేయటానికి వచ్చాను గాని......

సామి—అల్లా అనకండి నిస్సహాయులం. మట్టిలో మట్టితో సమానంగా బ్రతుకుతున్నాం. తినేచెప్పు విలువ లేదు మా బ్రతుకంతా. వెలుతురు ఎక్కడుందో చూపించి, ఈ అంధకారంలోంచి బయటకు మీరే నడిపించాలి. మీరే మమ్మల్నందర్నీ మట్టిలోంచి మనుషుల్ని చేయాలి.

(సామి పాదాలమీద వాలతాడు; గాంధి అతన్ని లేవనెత్తుతాడు)

తెర.





డా॥ కొర్రపాటి గంగాధరరావుగారు L. I. M.

జననం 10–5–1922. జన్మస్థలం మచిలిపట్టణం. విద్యాభ్యాసం ఏలూరు, మద్రాసులలో. బాపట్లలో వైద్యవృత్తిలో స్థిరనివాసం. తల్లి కీ. శే. లక్ష్మీనరసమ్మ. తండ్రి వెంకటక్రిష్ణయ్యగారు.

చిన్నప్పటినుంచి నాటకాలలో సరదా. నాల్గవఫారం చదువుతుండగా పద్నాల్గవఏట మొదటిసారి "హతవిధి" అనే నాటకం రచించి తయారుచేసి స్టేజిమీద ఆడేరు. ఇప్పటికీ నాటకాలు వ్రాయడం వేయడంకొరకే. అభిమాన రచయిత "ఇబ్సన్"—'ఇప్పటివరకు నేను సాధించగలిగినది, తేలికగా ప్రదర్శించడానికి నాటకాలు వ్రాయడమే' అని వీరంటారు. చాలా నాటకాలు, నాటికలు వ్రాశారు. ఇంకా వ్రాస్తున్నారు.

